

# గృహలక్ష్మి

## స్త్రీల సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు :

డాక్టరు. కే. యన్. కేసరి

# GRIHALAKSHMI

## LADIES' TELUGU MONTHLY

జూలై 1947



సంపుటము ౧౮] [సంచిక ౭




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప సంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# శ్రీ సర్వజిత్ నామ సం॥ అధిక శ్రావణమాసము

1947-వ సం॥ జూలై, ఆగస్టు నెలలు

| | | |
|---|---|---|
| 19 | శ | శు పా 3.51 పు 14.14 వజ్ర 18.7 బవ 3.51 రా 12.7 |
| 20 | ఆ | త 51.54 ఆ 10.2 సి 10.29 తై 24.24 రా 6.20 |
| 21 | సో | చ 46.34 మ 6.25 వ్య 14.2 వర్జ్య 53.14 దివి 25.31 ఆండాళ్ తిరునక్షత్రం |
| 22 | మం | పం 42.30 పూ ఫ 3.35 పరి 52.51 బవ 14.27 ది 21.5 |
| 23 | బు | ష 39.34 ఉ ఫ 1.46 శివ 46.6 కౌ 10.57 ది 22.35 |
| 24 | గు | స 37.47 హ 1.7 సి 42.27 గర 8.36 ది 21.22 |
| 25 | శు | అ 37.19 చి 1.43 శో 39.31 భ 7.28 ది 16.9 |
| 26 | శ | న 38.1 స్వా 3.24 శు 37.39 బా 7.35 ది 18.7 |
| 27 | ఆ | ద 39.52 వి 6.20 శుక్ల 36.42 తై 8.52 ది 17.7 |
| 28 | సో | ఏ 42.41 అ 10.18 బ్ర 36.29 వ 11.11 ది 25.28 |
| 29 | మం | ద్వా 46.17 జ్యే 15.9 ఐ 36.57 బవ 14.24 రా 5.15 |
| 30 | బు | త్ర 50.25 మూ 20.38 వై 37.49 కౌ 18.16 ది 16.15 శుక్రమూఢమి ప్రారంభం |
| 31 | గు | చతు 54.57 పూ షా 36.31 విష్క 38.57 గర 22.36 రా 16.50 |
| 1 | శు | ○ పూర్ణి 59.27 ఉ షా 32.32 ప్రీతి 40.9 భద్ర 27.7 రా 11.50 |
| 2 | శ | కృ పా 60.10 శ్ర 38.24 ఆయు 41.13 బా 31.30 రా 1 .39 |
| 3 | ఆ | పా 3.34 ధ 43.52 సౌ 41.55 కై 3.2 |
| 4 | సో | ద్వి 7.13 శ 48.51 శో 42.6 గ 7.13 దివి 3.12 |
| 5 | మం | త 10.14 పూ భా 42.36 అతి 41.34 భ 10.4 ది 5.36 |
| 6 | బు | చ 11.56. ఉ భా 55.28 సు 40.11 బా 11.56 ది 17.38 |
| 7 | గు | పం 12.41 రే 57.8 ధృ 37.52 తై 12.41 ది 26.13 |
| 8 | శు | ష 12.14 అశ్వ 57.34 శూ 34.31 వన 12.14 రా 15.57 |
| 9 | శ | స 10.32 భ 56.54 గం 30.18 బవ 10.32 ది 21.8 |
| 10 | ఆ | అ 7.38 కృ 54.46 వృ 25.0 కై 7.38 ది 25.40 |
| 11 | సో | న 3.38 రో 51.47 ధృ 18.37 గ 3.38 రా 1.17 |
| 12 | మం | ఏ 53.10 మృ 48.1 వ్యా 12.2 బవ 25.51 ది 4.46 |
| 13 | బు | ద్వా 46.37 ఆ 43.42 హ 4.36 కై 19.43 ది 7.24 |
| 14 | గు | త్ర 40.0 పున 39.6 సిద్ధి 48.43 గ 13.3 రా 26.15 |
| 15 | శు | చ ద 33.25 పుష్య 34.31 వ్యతి 40.40 భ 6 38 |
| 16 | శ | ● అమా 27.6 ఆశ్లే 30.12 వర్జ్య 32.54 చతుం 11 రా 27.5 |



"రష్యాలో నానిలకడ, అక్కడనే చేయగలపని, భారతీయుల బలము, అధికారములపై ఆధారపడియుంటుంది.
నన్నెవరూ వ్యక్తిగతముగా చూడరు; భారతీయుల ప్రతినిధినిగానే యోచిస్తారు."

శ్రీమతి విజయలక్ష్మి పండిట్.




జయజయగృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# శ్రీమతి విజయలక్ష్మీపండిట్ - రష్యాకు భారతరాయబారి.

శ్రీమతి విజయలక్ష్మి పండిట్ గారిని రష్యా ప్రభుత్వంవద్దకు ప్రథమభారతీయప్రభుత్వ రాయబారిగా పంపడానికి నిర్ణయమైనదనే శుభవర్తమానం భారత నారీలోకానికంతా హర్షదాయకమైనది. ఇందుకు ఆమెను, ఆమెనిట్లు నియమించి గౌరవించిన భారత కేంద్ర ప్రభుత్వాన్ని మే మెంతైనా అభినందిస్తున్నాము.

ఇట్టి పదవి వహించడానికి ఆమెకన్నా అర్హులు - స్త్రీలలోనేకాదు - పురుషులలోనైనా కలరాయని మాసంశయం. ఒక్కొక్క హంశంలో ఆమెకన్నా గొప్పవారే యుండవచ్చును. కాని అన్ని అర్హతలు, ఆమెనువలె ఒక్కచోట ఒక్కవ్యక్తి నాశ్రయించిలేవు.

కులీనత, అకుంఠిత దేశభక్తి, ఎడతెగని దేశసేవ, త్యాగధైర్యసాహసములు, పాశ్చాత్య పద్ధతులఎరుక, పరిపాలనా సామర్థ్యము, సోషలిష్టు సిద్ధాంతములనెడసానుభూతి మున్నగునవన్నియు ఆమెకు గలవు. మున్నెన్నడో 20సం॥లనాడే ఆమె తన అన్నతోకూడ బ్రస్సెల్సు నగరమున సామ్రాజ్య వ్యతిరేక వాదులసభలో పాల్గొని, అంతర్జాతీయ రాజకీయ వేత్తలలో అభ్యుదయవాదుల యోచనాపరంపర నవగాహన మొనర్చుకొనియేయున్నది. ఆమెఅన్న ఆనాటినుండియు, అంతర్జాతీయ రాజకీయవేత్తలలో ఉత్తముడుగా పరిగణింపబడుచున్నాడు.

ఊహ తెలిసినదిమొదలు ఆమెయింట ముఖ్యముగా జాతీయ అంతర్జాతీయ రాజకీయముల చర్చలుతప్ప వేరు ప్రసంగములులేవు. మొట్టమొదట రష్యానుగూర్చి సానుభూతితో గ్రంథం రచించిన భారతీయనాయకులలో ఆమెఅన్నయే ముఖ్యుడు.

ఇంతేకాదు; ఇటీవల ఆమె అంతర్జాతీయ సమావేశముల రెండింట అమూల్యమైన విజయకంకణముల సంపాదించినది. ఒంటరిగావెళ్లి ఫ్రాన్సిస్కో సమావేశముకడ ఎట్టిఅధికార పదవి లేకయే కొలదిమిత్రుల సాహాయ్యముతో - అనధికార భారతప్రతినిధిగా ఘనమైన కృషిసల్పి, భారతమాత స్వాతంత్ర్య సందేశమును అచ్చటగూడిన రాజనీతి చతురుల చెవికి, మదికి ఎక్కునటుల గావించినది. అదియే తుదకు బ్రిటిష్‌వారికి భారతదేశము నెడల గల వైఖరికి నేటిమార్పు వచ్చుటకు కారణమైనదంటే అతిశయోక్తి కాజాలదు.

ఆ పిదప, భారతప్రభుత్వపు, నిజమైన భారతరాజకీయ ప్రతినిధులతోగూడిన ప్రభుత్వపు, రాయబారిగా - పారిసు నగరమునకు యునెస్కో సభకువెళ్ళి, కొమ్ములుదిరిగిన స్మట్సుసేనానివంటి వృద్ధ రాజకీయవేత్త నోడించి, దక్షిణాఫ్రికా భారతీయుల హక్కులను అంతర్జాతీయ రాజకీయవేత్తలకు విచారణీయాంశ మొనర్చి మహాత్ముని మన్ననకూడా పొందినది. ఆమె సామర్థ్యాన్ని ఈ ఉభయ సన్నివేశాలలో స్వయంగా గ్రహింపగలిగిన రష్యా ప్రతినిధులు - తమ ప్రభుత్వమునకు, దేశీయులకు చెప్పగా, ఈమె నియామకమునకు వారును సంతోష స్వాంతు లగుచున్నారట.

రష్యా భారతదేశములకుగల సంబంధబాంధవ్యములు విశిష్టమైనవి. వానిని మా మిత్రులొకరు వివరముగావ్రాయగా వేరొకచో ప్రచురించితిమి. ఇట్టిసందిగ్ధ సన్నివేశములలో భావదాశ్యమునకు దారితీయని సఖ్య సహాయములను నూతన భారతీయ ప్రభుత్వము రష్యావల్ల పొందవలసి యున్నది. అట్టిదానిని సాధింపవలసిన బాధ్యత మన విజయలక్ష్మి పండిట్ గారిపై బడినది. ఆబాధ్యత నామె అసదృశ్యముగా నెరవేర్పగలదనుటకు సందేహములేదు.

ఇట్టి మహోన్నత బాధ్యతవహించి, ఇదివరకు తాచేబట్టిన కార్యములందెల్ల సాధించిన విజయకంకణములతో రష్యాదేశమునకు తరలిపోవుచున్న శ్రీమతి విజయలక్ష్మి పండిట్ గారికి భారత దేశమంతయు జోహారు లొనర్చుచున్నది.

భారత ప్రభుత్వము చేబట్టిన సోదరుడు జవహరిలాలునెహ్రూ ఆదరణాభిమానములతో, నిఖిల ప్రపంచమునకు శాంతిసందేశము నిచ్చుచున్న మహాత్ముడు ఆశీర్వచనములతో సాగనంపుచున్న శ్రీమతి విజయలక్ష్మి పండిట్ గారికి ఆంధ్ర స్త్రీలతరఫున మా "గృహలక్ష్మి"యు హృదయపూర్వకముగ దీవించి వీడ్కోలు నిచ్చుచున్నది.



# రష్యా - భారతదేశము

రష్యా భారత దేశముల సంబంధ బాంధవ్యములు విశిష్టమైనవి. రష్యా భారత దేశములకు 100 మైళ్ల పొడవు సరిహద్దు ప్రాంతము- హిమాలయముల అంచున కలదు. రష్యాకు భారత దేశముపై కన్నున్నదని బ్రిటిష్‌వారు భారత దేశపు రాజకీయముల జోక్యము పుచ్చుకొన నారంభించిన నాటి నుండి చెప్పచున్నారు. చాలవరకు వారిసైనికనీతి ఆసమస్యపైననే నిర్ణయమగుచూ వచ్చినది. అయితే 1917 లో విప్లవానంతరం అతఃపూర్వము రష్యా అవలంబించిన సామ్రాజ్య తత్వనీతి విరమింప బడినది. కానివారది మొదలుగా నూతన సాంఘిక సిద్ధాంతముల ననుసరించి, అత్యంత శీఘ్ర కాలంలో అత్యద్భుతమగు అభివృద్ధి గాంచి, అజ్ఞానము, అనారోగ్యము, ఆకలి, నిరుద్యోగము, అసమానత్వము మున్నగు బాధలకు ఆదేశమున నిలువ నీడలేకుండా చేసుకున్నారు. అది ప్రపంచమునగల బానిసజాతులకు, పీడితవర్గములకు ఆశాజనకమైనది. గాలిలో దీపముంచినట్లు సామ్రాజ్యతత్వభూయిష్టమగు ప్రభుత్వములమధ్య నేర్పడిన సోషలిస్టు ప్రభుత్వమునకు పెంపొందుట కష్టసాధ్యమే. పైగా ఈ నూతన సాంఘిక సిద్ధాంతమును మతావేశముతో ఇతర దేశముల ప్రచారమొనర్చి వ్యాపకమొనర్పవలయుననేవారును వారినాయకులలో లేకపోలేదు. అసలు వారిమూల సిద్ధాంతములోనే- "ప్రపంచకార్మికులందరు ఏకముకండు" - అనేనినాదమున్నది. కావునసోషలిస్టు సిద్ధాంతములు - అన్నిదేశములలో వలెనే భారతదేశమునను వ్యాప్తిచెందినవి. "కొందరు భారతీయ యువకులకు భారత దేశము మాతృభూమికాగా రష్యా పితృదేశమై వరలుచున్నది." అని శ్రీ సర్. యస్. రాధాకృష్ణన్‌గారు పలుమారు చలోక్తిగా చెప్పియున్నారు.

కాని రెండవ ప్రపంచ యుద్ధమారంభమైన దాదిగా రష్యా, హిట్లరుతో సఖ్యమేర్పచు కొన్నది మొదలు రష్యను విదేశాంగ రాజనీతి ఇతరులకు దురవగాహముగానున్నది. ముఖ్యముగా, చిరకాలమునుండి భారత దేశమున విప్లవము నభిలషించిన రష్యాకు మిత్రులైన కమ్యునిష్టులు 1942 లో భారతీయ విప్లవమునకు వ్యతిరేకులగుట నిగూఢ సమస్యయైనది. నేడు రష్యావారు తమచుట్టుప్రక్కలగల దేశముల నవలంబించుచున్న రాజనీతి, కల్గించుకొనుచున్న జోక్యము సామ్రాజ్యదేశములకు వ్యతిరేకమైనను, 1917 పూర్వపుజారుచక్రవర్తి కోరికలకు భిన్నము కాదేమో యను రాజకీయవేత్తలనుగలరు. ఆమధ్య భారత కమ్యునిష్టులు ముస్లింలీగు పాకిస్థాన వాదమును బలపరచిరి. నేడు బ్రిటిష్‌వారు పాకిస్థానమునకు వీలేర్పరచి సరిహద్దు ప్రాంతముల (పాకిస్థానమున) రష్యాకు ప్రతిగా సైనికకేంద్రము నేర్పరుప యోచించుచున్నారని సరిహద్దుగాంధీవంటి సాధుపుంగవుడే అనుచున్నాడు.

అయితేభారతదేశమునకు అంతర్జాతీయసమావేశముల రష్యావంటి మిత్రదేశము లేదనవచ్చును. మరియు 150 సం॥ల అనంతరము తిరిగి రాజ్యాధికారము వహించిన భారతీయులు - 1917 లో రష్యా దేశీయులున్న స్థితిలోనే యున్నారు. వారత్యంత శీఘ్రకాలములో సర్వతోముఖాభ్యుదయమునంది - వివిధదేశములతో తులతూగుచు - ప్రపంచశాంతికి తోడ్పడవలెనంటే, రష్యాలో అవలంబింపబడిన కొన్ని పద్ధతులను,

సాంఘిక వ్యవస్థ విస్తారము తారుమారు కాకుండా, అహింసాయుతముగా అవలంబించవలసి యుండునేమో! అందుకు వారి ప్రావీణ్యత, విజ్ఞానము మనకు తోడ్పడవలసి యున్నది.

అయితే దానికి ప్రత్యామ్నాయముగ మన ప్రభుత్వము రష్యావారి వెంట తాళము వేయజాలదు. బ్రిటిష్ సామ్రాజ్యాంతర్గతులమై విదేశాంగనీతిలో వారి ననుసరించుటకును, స్వతంత్రులముగా రష్యాకు, శిష్యులమై - వారివెంట తాళము వైచుటకును విశేష భేదములేదు; బహుశా రెండవదే ప్రపంచమున కెక్కువ ప్రమాదకరమేమో! విదేశాంగ నీతియందు, అంతర్జాతీయ సమావేశముల, చీనా భారతదేశములు-స్వతంత్రమార్గము నవలంబించిననాడే ప్రపంచమునకు శాంతి. కావున ఏ తెల్వితో కీ. శే. సన్ యాట్ శేన్ రష్యాను యథాతథముగ ననుసరింప నగత్యములేకయే రష్యావల్ల సఖ్య, సహాయముల సంపాదింపగల్గెనో, ఆ వివేకముతో నేడు భారతదేశము రష్యాతో మెలగవలసి యున్నది. కావున భారతదేశమునకు ప్రతినిధిగా రష్యాదేశమున రాయబారియై వెళ్లుచున్న శ్రీమతి విజయలక్ష్మి పండిట్ గారి కర్తవ్యము చాల బాధ్యతతో కూడుకొన్నది.

— 'లీలావతి' —

## "ఇండియన్ రిపబ్లిక్ ప్రథమాధ్యక్షురాలు హరిజన బాలిక"

త్వరలో ఏర్పడనున్న ఇండియన్ రిపబ్లిక్‌నకు మొదటి అధ్యక్షుని ఎన్నుకొనవలసిన కాలము ఆసన్నమైనది. బ్రతికున్నట్లైతే కీ॥ శే॥ చక్రయ్యను (ఇతడాంధ్ర హరిజనుడు) ప్రతిపాదించి యుందును. దొడ్డ హృదయంగలిగి, ఏవిధమైన కక్కుర్తికి పాలుగాక, స్ఫటికమువలె స్వచ్ఛమైన పవిత్రప్రవర్తనకలిగి, ఉండే మెహ్తర్ (హరిజన) బాలిక ఎవరైనా మన ప్రథమాధ్యక్షురాలుగా ఉండగలందులకు దొరికితే బాగుండును. ఇదివట్టి వెర్రి కలగాదు. మోటువాళ్లైనా పల్లెటూరి వారినే, మన అధ్యక్షులుగా చేసుకోవలెనని తలిస్తే అలాంటిహరిజనబాలికలు లేకపోలేరు. ఇకపై మనఅధ్యక్షులకు ఇంగ్లీషు రానక్కరలేదు. అవసరమైన విదేశభాషలు నేర్చి, నిజమైన పరిపాలనాచాతుర్యము తెలిసిన తెలివిగల దేశభక్తులు వారికి సలహాదార్లుగా ఉంటారు. అయితే భ్రాతృహత్యల పురిగొల్పే రక్తదాహమును మనము అణుచుకొని గ్రామాలవైపున దృష్టి నిగుడ్చిననాడే - నా కలలు నిజమవుతాయి.

మహాత్ముడు.

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. యస్. కేసరి.

రాణితోటలో ప్రదర్శనశాల తగులబడిపోయినపిమ్మట నాతల్లి నన్ను ఒంటరిగ మద్రాసులో విడిచిపెట్టి పోలేదు. మేమిరువురము మద్రాసులో యుండవలసివచ్చినది. నేను బడిలో చదువుకుంటూ యిద్దరు వర్తకుల పిల్లకాయలకు బడిపాఠములను చెప్పుచుంటిని. వారు నాకు నెలకు చెరియొకరు 2-8-0 లు ఇచ్చేవారు. ఈ రు 5 ల వరుంబడితో ఇద్దరము మద్రాసులో బ్రతుకుటకు కష్టమైనది. నాతల్లిఒక కోమటి ఇంట్లో వంటచేయుట కారంభించినది. అందుకు వారామెకు నెలకు రు 5 లు ఇచ్చేవారు. ఈ విధముగా ఇరువురముకలిసి రు 10 లు తెచ్చుకొనుచు కాలము గడుపుచుంటిమి. ఆకాలమున రూపాయికి బియ్యం 6 పళ్లుమొదలు 8 పళ్లవరకు ఇచ్చుచుండిరి. సమీపమునయున్న రావిచెట్టు అగ్రహారమున భిక్షమెత్తుకొనే బ్రాహ్మణులు రూపాయకు 8 పళ్ల బియ్యమును అమ్మేవారు. మేము తరుచుగా వారివద్దనే బియ్యం కొనేవారము. ఈ ప్రకారము కొంతకాలము జరిగినది.

ఆ కాలమున కాలేజిలో చదువుకొనే విద్యార్థులకు హాస్టల్సులేవు. తెలుగువారికి అరవహోటలు భోజనము సరిపడేదికాదు. అందువల్ల ఆంధ్రులు ఎక్కడనైనా ఒక్క రూమును చదువుకొనుటకు అద్దెకుతీసుకొని సామాన్య గృహస్థులఇండ్లలో డబ్బిచ్చి భోజనముచేసి చదువుకొనుచుండేవారు.

ఆ రోజులలో టంకసాలవీధిలో కాశీపాటి (వారింటిపేరు కాశీవారు; ఆమెను-పాటి అనగా అరవంలో అవ్వా అనేవారు.) హోటలులో కందిపప్పుపచ్చడి, వేపుడుకూరలు వడ్డించేవారు. అందువల్ల కొందరాంధ్రులు అక్కడ చేరసాగినారు. ఈ హోటలులో అరవలు, ఆంధ్రులుకలిసి యుండుటవల్ల భోజనపదార్థములలో పేచీవచ్చి, ప్రతిదినము పిల్లకాయలు దెబ్బలాడుకొనుచుండేవారు. ఇందువల్ల ఆమె తెలుగువారిని తనహోటలుకు రావద్దని వెళ్ళగొట్టినది.

ఆ సమయంలోనే అమ్మాయమ్మయను తెలుగుఆబిడ తెలుగువారికి ప్రత్యేకంగా హోటలుపెట్టి, తెలుగువారికి సరిపడు వంటకములనుచేసి, పిల్లకాయలను తృప్తిపరచు

చుండెను. ఆ కాలమున హోటలుకు నెలకు రు 7 లు మొదలు రు 10 ల వరకు ఇవ్వవలసి యుండెడిది. అమ్మాయమ్మయు తెలుగువారివద్ద రు 10 లు వసూలుచేసెడిది. కాని వీరికి వేపుడుకూరలు, కోరినపచ్చళ్లు, ఆవకాయ, ఊరగాయ వగైరాలు - ఇవి కలుపుకొన్నపు డెల్లా ముద్దముద్దకు చారెడేసి కమ్మనినేయి - ఈ విపరీతపుఖర్చుకు తట్టుకోలేక పోయినది. ఆమె వీరిని భరించజాలక హోటలుముగించి తలుపు మూతమూసినది.

క్రమముగా ఆంధ్రవిద్యార్థులు మద్రాసులో విస్తారమైనారు. కొందలు విద్యార్థులు భోజనమునకై ఈ ఇబ్బందులు పడలేక ఇక్కడ కాపురములే పెట్టుకొనసాగినారు. అయితే ఆంధ్రులకు అరవలుండుఇండ్లలో కాపురమునకు స్థలముచిక్కుట దుర్లభమైనది. ఏలనంటే ఆంధ్రులకు ఆచారములేదు; మగవారు చుట్టలుత్రాగుచు ఎక్కడపట్టిన అక్కడ ఇల్లంతా ఉమ్మివేయుచుందురు; బిడ్డలు ఇల్లంతయు చెరిచెదరు; సాధారణముగా స్నానముచేయరు- అని అరవవారికి వీరియందొక అపోహ. ఇది కేవలము అపోహయే కాదేమో.

సరిగా నిట్టిసమయంలో వంగవోలునుండి కొండపి రామకృష్ణరావు, గొట్టిపాటి చెంచు సుబ్బారాయుడుగార్లనే వారిరువురు మద్రాసుకు కాలేజీ విద్యకై వచ్చిరి. ఈ చెంచు సుబ్బారాయుడుగారు ఇప్పుడు హైకోర్టులో ప్రాక్టీసుచేయుచున్న సుప్రసిద్ధ న్యాయవాదులగు శ్రీ చింతగుంట రాఘవరావుగారి మామగారు. చెంచు సుబ్బారాయుడు గారు చాలా ఆచారవంతులు. కాఫీ పుచ్చుకొనేవారు కారు; చిరుతిండ్లు తినేవారుకారు; శివార్చన చేయనిది భుజించేదిలేదు; సత్యవంతుడు. ఇట్టివారికి నగరంలో భోజనవసతి దొరకుట కష్టసాధ్యము. వీరిరువురు మాస్వగ్రామ ప్రాంతమువారగుటచే కాబోలు ఎట్లో నన్ను తెలిసి కలుసుకొన్నారు. ఎట్లైనా తమకు భోజనవసతి ఏర్పాటుచేయమని గట్టిగా కోరినారు. నేను అప్పుడు నాతల్లితో యోచించి, ఆమెచేయుచున్న వంటకొల్వును మాన్పించి వీరిరువురికిని ఆచారముగ అన్నము వండిపెట్టు ఏర్పాటు చేసినాను. మేము అగ్రహారములో పెద్దగదిని అద్దెకు పుచ్చుకున్నాము. మాతల్లి అనుకున్న ప్రకారము వీరిరువురికిని వంటచేసిపెట్టుచు వచ్చినది. చెంచు సుబ్బారాయుడుగారికి ఆచారమేగాకుండా కొన్ని భోజన నియమములుకూడ యున్నవి. ఈ ఊరికాయగూరలనుతింటే ఏవేమో జబ్బులు వస్తవిఅని వారిభయము. అందువల్ల ఇంటినుండి చింతపండుపచ్చడిని, ధనియాల పొడిని తెప్పించుకొని వాటితోను చారు మజ్జిగలతోను భుజించుచుండెడివారు. పండుగ నాడుకూడా వారికదే భోజనం. చదువుకొనుటకు వారు యేర్పాటుచేస్తుకున్న రూముకు

రాత్రిళ్ళు నేనుగూడ వెళ్లి వారికి తోడుగ పడుకొనేవాడను. ఈ కారణమువల్ల వారికి నాకు మంచిస్నేహము కుదిరినది. వీరితోకూడయుండిన కొండపి రామకృష్ణరావుగారున్ను చాలా పెద్దమనుష్యులు. వారిరువురితో నేను చాలా చనువుగా ఉండేవాడను.

ఇట్లుండగా నాతల్లి అకస్మాత్తుగా చనిపోయినది. మద్రాసులో నేను మరల ఏకాకినైనాను. నాకు భోజనమునకే కరవైనది. అయితే ఈసారి నాకు మరి ఇరువురు తోడైనారు. మాయింట్లో భోజనముచేయుచుండిన విద్యార్థులకుకూడ భోజనవసతి తప్పిపోయినది. మేము ముగ్గురమును చాల కష్టపడవలసి వచ్చినది. కాని దైవ మొక్కదారి చూపినాడు.

మేముండే ఇంటిలోనే జొన్నలగడ్డ నరసమ్మ అనే ఆమె కాపురమున్నది. ఆమెను నేనాశ్రయించి వారిరువురికిని భోజనము వండిపెట్టుటకు వప్పించితిని. నరసమ్మ సమ్మతించుచు, మరి ఎవరినైనా కొంతమందినికూడా కుదిర్చిన బాగుండుననెను. అప్పుడు నేను కావలి కాపురస్థులగు విస్సా రామారావుగారిని, వెన్నెలకంటి కృష్ణస్వామిరావుగారిని, ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారిని జతగూర్చితిని. అప్పుడదియొక చిన్న భోజనశాలయైనది. నరసమ్మగారు వంటరియగుటచే ఆమెకు కావలసిన వస్తువులు తెచ్చియిచ్చుచు, నేనుకూడ ఆవిద్యార్థులతోకూడ భోజనము చేయుచుంటిని. నరసమ్మగారు తెనుగువారి వంటలను రుచికరముగా చేయుటలో మంచినేర్పరులు. నరసమ్మగారికి సంతానములేదు. దైవికముగా కల్గిన మా పరస్పర సన్నివేశమువలన - ఆమెకునాయందు పుత్రవాత్సల్యమును, నాకామె యందు మాతృభక్తియు కుదిరి పెంపొందినవి. నా తల్లిపోయిన వెంటనే ఈ విధముగా దేవుడు నాకు మరియొకతల్లిని చూపుట నాఅదృష్టమే.

ఆమధ్య కాలమున నేను చదువు చాలించుకొని ఉద్యోగంకొరకు ప్రయత్నించుచుండగా, బెంగుళూరు సమీపమునయుండు చిక్‌బళాపురము పోలీసు ఇన్‌స్పెక్టరుగారు మద్రాసుకు వచ్చియుండిరి. వారు ముసల్మానులు. వారితో ఒకరు నన్ను పరిచయపరచిరి. వారునాకు పోలీసు డిపార్టుమెంటులో యేదైన ఉద్యోగమును ఇప్పించెదనని వాగ్దానము చేసిరి. అందువల్ల వారిని పలుమారు కలుసుకుంటూ వచ్చితిని. ఇంతలో నా ఇన్‌స్పెక్టరు సాహెబ్‌గారి కూతురికి పెండ్లి మద్రాసులోనే కుదిరెను.

ఆ పెండ్లికి సాహెబ్‌గారికి నెయ్యి చక్కెర వగైరా సామానులు కావలసివచ్చెను. వారు ఈఊరికి కొత్తఅగుటచే నన్ను తన్నెవరికైన సిఫారసుచేయమని అడిగిరి. అప్పుడు

అగ్రహారం ప్రక్కనయున్న మళిగెఅంగడివానితో చెప్పి సామానులను ఇప్పించితినిగాని సాహేబు డబ్బుయివ్వలేదు. అంగడివాడు సాహేబ్ పేర పద్దు వ్రాసుకొని దానిపై నా చేవ్రాలుకూడ పెట్టమనెను. పెట్టితిని. పెండ్లికాగానే సాహేబ్ ఊరికివెళ్లి పైకమునుపంపె దనని చెప్పిరిగాని పంపలేదు. నేనుకూడా వారిఊరికివెళ్లి అడిగితిని. ఇప్పుడు పైకములేదు- వెనుక పంపెదనని చెప్పి నన్ను సాగనంపెను. కొంతకాలము అంగడివాడు వేచియుండి కోర్టులో దావాచేసి మాయిరువురిమీద డిక్రీపొంది నన్నుఅరెస్టుచేయించి, అప్పులజైలులో పెట్టించెను.

పగలు 10 గం॥ లకు నన్ను జైలులోనుంచిరి. నేను సకాలమునకు భోజనమునకు రానందున నరసమ్మగారు నన్నుగూర్చి విచారించగ నేను నిర్బంధములోనున్నట్లు ఆమెకు తెలిసి, ఆతురతతో గిన్నెలో అన్నమునుతీసుకొని నడిఎండలో నావద్దకు నడచివచ్చినది. నన్ను చూచి నాఅవస్థకు కన్నీళ్లుపెట్టుకొనుచు, కన్నకొడుకునకువలె కనికరముతో ఆదిన మున నాకు అన్నముపెట్టిన ఆచల్లనితల్లి దృశ్యమును నేను ఇప్పటికిని మరువజాలను. ఆసాయంత్రమే నాబాల్యస్నేహితులగు అన్నం చెన్నకేశవులుశెట్టిగారు నా అవస్థనువిని జైలుకువచ్చి నాబాకీ రు 150 లుచెల్లించి నన్నువిడుదలచేయించినారు. నేను ఆనిర్బంధములో 6 గం॥ల కాలము గడపవలసి వచ్చినది.

పిమ్మట నేను ఉద్యోగమునకై పలువిధముల పాకులాడవలసి వచ్చినది. అప్పుడు వేసిన ట్రాంబండ్లలో వుద్యోగమునకై ప్రయత్నించితిని; కాలేదు. ప్లీడరు గుమస్తాపని ఒక నెల మాత్రమే చేస్తిని; అదియు తుదముట్టలేదు. కడకు ఏదియు కొనసాగలేదు. ఇతరు లను ఆశ్రయించి ఉద్యోగమును సంపాదించుకొనుట అసాధ్యమైనదని తోచి ఆకార్యమును విరమించుకున్నాను. అఖరుకు వైద్యవృత్తి నెట్లవలంబించినదియు మొదటి ప్రకరణములో చెప్పియున్నాను. ఆ అవాంతర దశావిశేషములను కొన్నింటిని మరియొకసారి వ్రాయించెదను.



# కృష్ణ తన్మయి రాధిక

శ్రీ పైడిమఱ్ఱి వేంకట సుబ్బారావుగారు

"శిరమున మోయుచున్ బెరుగుఁ జెంగటి యమ్మథురాపురమ్ములో
బిర బిర నమ్మనచ్చునని సాగితిఁ జల్లని శ్రావణీ మనో
హర పవనమ్ములే విసరు, సంగడిఁ గోవులు లేగ 'లంబ' యం
చఱచును మానసమ్ములు ప్రియంబులు జెమ్మగిలంగ నెంతయున్!

"కాని, ప్రియ! మది నీదు శృంగార పరత
నీశరచ్చంద్ర చంద్రికాహితమగు దధి
'నెవరు కొనువార' లనబోయి, యెఱుఁగకుండ
నటులె 'గోవింద! గోవింద!' యని యఱచితి,
నిది గనినవారు నవ్వినారేమొ? యెఱుఁగ.

"లలిఁ బ్రవహించు నయ్యమున రమ్యత నావలు నీదుతావు సం
కులమున జేరితిన్ బెరుగుకుండలతోఁ, జెలులంమజూచి, "యీ
వలనను రమ్మ! యాడుదమె? పాడుదమే! విరిమొగ్గలేరి వ
ల్వాలు ఘుసృణత్వమున్ బరఁగవచ్చు వసంతము బిల్తుమే!" యనన్.

"కాని, ప్రియ! మది నీవేణుగాన వార్ధిఁ
దేలి యాడె లతాంతమ్ము లీల, నట్టి
తన్మయత్వమ్ములోన నెంతయు నెఱుఁగక
నటులె, "గోవింద! గోవింద!" యని యఱచితి,
నిది గనినవారలెంత దూషించినారొ!

"కల కల బాఱు నాతటిని కమ్మఁగ, ప్రక్కన దేవళంబు మ్రొ
క్కుల గొని జేర దీపములు గొబ్బున వెల్గుచునుండె; వాని ముం
దల కరముల్ మొగిడ్చితిని ధ్యానసమాధిని, శంఖముల్ శ్రవః
ఫలకముల గదల్చఁగ, నభస్థలిఁ బర్వఁగ మ్రోగెనిండుగాన్!

"కాని, ప్రియ! నీదు ధ్యాన మగ్నతను మనసు
లయముగాఁ "జ్యోతులార! రేల్పవలు బ్రోవుఁ"
డనక "గోవింద! గోవింద!" యని యఱచితి
నెఱుఁగకయె! వారలెంత గోపించినారొ?
వెలుఁగు వెల్లువలే బాఱె విస్మయముగ."

శ్రీమతి సరోజినీనాయుడుగారి (Radha the milk maid) రాధా దిమిల్క్ మెయిడ్ నకు ఛాయానువాదము

# 'పుష్పావతి'

శ్రీమతి మన్య కామేశ్వరీదేవిగారు

తార్తారు వంశసార్వభౌముఁ డల్లాయుద్దీను చిత్తూరు దుర్గమును ముట్టడించి పెక్కేండ్లు కష్టపడి, యెత్తరాని యవతారములెత్తి, కడకు 1303 వ సంవత్సరమున దానిని దన యధీనము చేసికొనెను. నూఱులు వేలును వీరయోధులు గతించిరి. రాజకుటుంబమంతయు నిహతమయ్యెను. అజయసింహుఁడు నతని యనుజు 'డూరు' సింహుఁడును మిగిలిరి. అజయసింహుడు మేవాడ పాలకుఁడయ్యెను. ఊరుసింహుఁ డన్నిగతుల నన్నకుఁ దోడ్పడుచుండెను!

ఒకనాడుదయము కొందఱు మిత్రులు వెంటరా నూరుసింహుడు మృగయావిహారమునకు వెడలెను! చేరువఁగల "యెండ్వా" రణ్యముల సంచరించుచు మధ్యాహ్నమగు డొక ఘోరవరాహపోతమును వెంబడించిరి. అదియు వారిని నానావిధములఁ ద్రిప్పి యలయించి- తుదకొక జొన్నచేను బ్రవేశించి యదృశ్యమయ్యెను. ఊరుసింహుఁడు నతనిస్నేహితులు దానిని దఱుముకొనుచుపొలమును సమీపించిరి. అప్పటికే మంచెపై నిలచి పిట్టలఁ దోలుచుండిన-

పడుచు:—పూజనీయులారా! మీరందఱిటు లొక్కుమ్మడి ప్రవేశించిన పైరు చెడిపోవునుగదా! మీకేమి కావలయునో తెలుపుఁడు. సమకూర్తును.

ఊరుసింహుఁడు:—బాలికామణీ! మేము తఱుముకొనివచ్చిన పంది నీచేను దూరెను. దానిని బట్టుకొన వచ్చియుంటిమి!

పడుచు:—మీకు శ్రమవలదు! సజీవముగనో విగతజీవముగనో దానిని బట్టికొనితెచ్చి మీకప్పగింతును. తొందరపడకుఁడు!

ఊరుసింహుఁడు:—తన్వీ! ఆయుధపాణులమైన యిందఱము వీరుల నలయించితెచ్చిన యావరాహము నిరాయుధవైన నీకు లభించునా? మేము పట్టుకొందుము- మఱియు నీపైరునకు జెఱుపుగలుగనీయము!

పడుచు:—అయ్యా! యింతదాక మీప్రయత్నము ఫలించలేదు. నేనును వీరవంశ సంజాతనే? దాని నశ్రమముగఁ బట్టితెచ్చి మీకిత్తును? నాపాలికీపంది యొక యెలుకపిల్లవంటిది.

అని నవ్వుకొనుచు, నొకదంటుపీకి- చివ్వి పైరునఁ జొరఁబాఱి నాలుగునిమిషములలో నావరాహ కళేబరము నీడ్చుకొనితెచ్చి వారిముందర విడిచెను!

ఊరుసింహుఁడు:—తరుణీ! నీధైర్యసాహసములఁ గొనియాడెద. నీతలిదండ్రు లెవ్వరు? నివాసమేది?

పడుచు:—'జగత్పతి'యనియు 'భారతఖండ ప్రచండమార్తాండు', డనియు నపారకీర్తిఁగాంచిన పృథ్వీసార్వభౌముని జననముచే నేవంశము పరమపావనమయ్యెనో అట్టి చోహాణఁ (చతుర్భుజ) వంశమున నవతరించిన చంద్రసింహుని పుత్రికను! ఈ చేరువగ్రామమున నున్నాము. నన్నుఁ బుష్పవతి యందురు. మీరెవరో తెలియఁగోరెద?

ఊరుసింహుఁడు:—కన్యకామణీ! రాణా అజయసింహుని యనుజుఁడ. నన్నూరుసింహుఁ డందురు! నిన్ను దర్శింపఁగలిగితి. నేడు సుదినము ? ఇక సెలవు!

అని యందఱు వెడలిరి. మండువేసవి. మధ్యాహ్నసమయము! నీరజమిత్రుఁడు నిప్పులుమియు చుండెను! చేరువఁబారు సెలయేటి దరిఁజేరి గుఱ్ఱముల నచట వృక్షశాఖలఁగట్టి అందఱాహారముఁ గొనఁ గూర్చుచుండిరి.

ఇంతలో! రివ్వున నొకచిన్నరాతి గుండువచ్చి ఊరుసింహుని యశ్వమునకుఁ దగిలి దానికాలు కుంటువడెను. అందఱును మోములెత్తి చూడసాగిరి. ఇంతలో మంచె దిగివచ్చి

పుష్పావతి:—అయ్యలారా! కంకులపై వ్రాలకుండఁ పక్షులను దోలుతతీ, రాయి యొడిసెలనుండి తప్పివచ్చి పొరపాటున మీయశ్వమునకుఁ దగిలినది. ఉద్దేశపూర్వకముగాని నా యీ య ప రా ధ ము ను మన్నింపుఁడు.

ఊరు:—పుష్పావతీ! నీపేరువలెనే నీ హృదయ మత్యంతకోమలము. నీయుదాత్తహృదయ మెఱింగిన మేము నిన్నన్యథా భావింపము. నిశ్చింతముగనుండుము!

పుష్పావతి:—రాజా! మీకరుణామయ హృదయము నెంతయుఁ గొనియాడుదు!

అని సెలవొంది వెళ్లెను. రాజపుత్రులు భోజనములొనరించి కొంతవడి విశ్రమించిరి. ప్రొద్దువాటి వేళ కందఱశ్వములపై నధిరోహించి రాజధానిదెసకుఁ బయనింపసాగిరి. ఇంతలో మార్గమున — క్షీరఘటము శిరమున నిడికొని, రెండుచేతుల రెండుమేకలను బట్టి నడిపించుకొనుచు నొకకాపు కన్నె వారి కెదురయ్యెను. ఆమె పుష్పావతియని వారు తెలిసికొనిరి. వేడుకకై వారామె పాలకుండను క్రిందికి ద్రోయవలెనని యాలోచించిరి. అంత, వారిలో, హరిసింహుఁడు తనహయము నామెను ద్రోసికొని పోవునట్లు నడిపించెను!

పుష్పావతి కలఁతవడక - కుడిచేతిపగ్గము నొకవిధమునఁ ద్రిప్పి తనమేక హరిసింహునిగుఱ్ఱము ముందఱి కాళ్ల నడుమకు నడిపించెను! అశ్వముబెదరి, తొట్రిలెను. హరిసింహుడు నేలకువ్రాలెను. పుష్పావతి పాలకుండతో నెమ్మదియై నిల్లుచేరుకొనెను!

మఱునాడుదయ మూరుసింహుడు గంధర్వముసెక్కి- చంద్రసింహు నింటికివెళ్లెను. అత డితని కెదురువచ్చి కొనిపోయి పడసాల నాసీను గావించెను! సమానస్వాతంత్ర్యభావమున నతని యెదుర నాసనమునఁ గూర్చుండి

చంద్రసింహుఁడు:—ప్రభూ! మిమ్మింతదూరము గొనివచ్చిన కార్యమేదియో తెలిసికొనఁగోరెద?

ఊరు:—అయ్యా! నిన్న నేనును నామిత్రులును, వేటకైవచ్చి మీపుష్పావతిని దర్శించితిమి. ఆమె ధైర్య సాహసముల స్వయముగా నెఱిఁగితి. ఇపుడామెను వివాహమాడఁగోరి మీయనుమతిఁ బడయవచ్చితి!

చంద్రసింహుఁడు:—ప్రభూ! మీరాక నాకు బరమహర్షప్రదము! కాని మేము సామాన్యకృషీవలులము! మీరు మహారాజులరు! వియ్యమునకు, నెయ్యమునకు సమతవలయుగదా? కావున మీయుపపాదనము నాకు సమ్మతముకాదు! వేఱొకకన్యను చూచుకొనుఁడు.

ఊరు:—నాకామెపైఁ గోర్కెకలదు. మీరనుమతించిన మీయింటనే వివాహ మతివైభవముతో జరుప నేర్పాటుగావింతును.

చంద్రసింహుఁడు:—అదియే నేను వలదనినది! ఇఁకసెలవు!

అని లేచెను! కొండంతటి యాసతో నరుదెంచియుండిన యూరుసింహుని యుల్లమున బ్రహ్మాండ మంతటి నిరాశా నిరుత్సాహములు నివ్వటిల్లెను! ఏమిచేయుటకు దోపక యతఁడు లేచ్చివచ్చి, పుష్పావతీ జాగ్రన్మంగళవిగ్రహమతని హృదయమున స్థిరనివాస మేర్పఱుకొనుట రాజధానికేగక యాగ్రామము సమీప మందలి యుపవనమున నిలిచెను!

ఇచటఁ జంద్రసింహుని యింట నతనితల్లి జరిగిన విషయమెఱింగి కుమారునిబిలిచి యతని యనాలోచిత ప్రవర్తనమునకై కఠినముగ దండించెను. ఊరుసింహుఁ డడిగినంతనే 'పదివేల'ని సమ్మతించి యుండవలసినదని నుందలించెను!

చంద్రసింహునకుఁ దల్లిమాటలే ప్రమాణము. పశ్చాత్తాపతప్తుఁడై సాయంత్రము వాహ్యాళివ్యాజమున నుపవనమున కేగెను. ఊరుసింహునిచూచి మాటాడెను. అతనికి పుష్పావతి నిచ్చునట్లు సమ్మతిఁదెలిపెను.

మహావైభవముతోఁ బెండ్లిజరిగెను. వారి వివాహపుణ్యఫలమే 'మహారాణాహమీరసింహుఁడు'. అజయసింహు నానతిమెయిఁ దన పంధ్రెండవసంవత్సరమున మేవాడ్ సింహాసనమెక్కి యఱువదినాలుగేండ్ల ప్రతిహతముగా నవనిఁ బాలించి నిజయశశ్చంద్రికలు నిఖిలదిగ్వీథుల నెరపిన యానిరుపమాన సార్వభౌముని గూర్చి ముందుఁదెలిసికొందురు.

---

## విజ్ఞప్తి

'గృహలక్ష్మి' యందలి రచయితల చిత్రపటములు ప్రచురింపుడని పలువురు కోరుచున్నారు. ఆకోరిక మాకెదివరకేగల అభిలాషను ఇనుమడింప చేసినది. కాన క్లుప్తమగు తమ చరిత్రలతోపాటు చిత్రపటములనుగూడ రచయితలు మాకంపగోరెదము.

సంపాదకుడు.

---



ఈ మధ్య లండనులో జరిగిన భారతీయకళాప్రదర్శమున
పాల్గొన్న భారతనారీమణులు.

# భారత దేశంలో నర్సింగు వృద్యమం

శ్రీ వేముగంటి అనంతరావుగారు.

దుర్భర రోగపీడిత మానవకోటిని సేవించుట, ప్రసవసమయమున స్త్రీలకుసహాయ పడుట, అనాధ శిశువులను పెంచుట - యివి నర్సింగు వృత్తియొక్క ప్రధాన ధర్మాలు. ఆంగ్లపరిపాలన ప్రారంభమైనప్పటినుంచీ మన దేశంలో యీ నర్సింగువృద్యమం ప్రారంభ మైంది. మన దేశంలో సర్వసాధారణంగా స్వవృత్తి, స్వావలంబనాలపై ఆధారపడవలసిన మధ్యమశ్రేణిస్త్రీలు అవలంబించే వృత్తులలో యీ "నర్సింగు" ఒకటి. ప్రస్తుతం తగిన ఆదరగౌరవాలు లేకపోవుటచేత యీ"నర్సింగువృత్తి" మనదేశంలో యింకా బాల్యావస్థ లోనేవుంది. ఇతరదేశాల జనసంఖ్య, అక్కడవుండే నర్సులసంఖ్యచూస్తే మనకీవిషయం సులభగ్రాహ్య మవుతుంది.

సుమారు 4 కోట్లమంది జనాభాకలిగిన మన బొంబాయిరాష్ట్రంలో 2,000 మంది నర్సులు వున్నారు. బొంబాయిరాష్ట్రంకంటె చిన్నదైన బ్రిటనులో సుమారు 1,20,000 మంది సుశిక్షుతులైన నర్సులు వున్నారు. ఇంతకంటె ఆశ్చర్యకరమైన సంగతేమిటంటే మొత్తము భారతదేశంలోవున్న నర్సులసంఖ్యకంటె, ఒక్కలండన్ పట్టణంలోవున్న నర్సుల సంఖ్య యెక్కువ! బొంబాయిలో సుమారు 14,000 మంది మనుష్యులకు ఒక్కనర్సు మాత్రమేవుంది. నిజంచెప్పాలంటే మనదేశంలో 214 చదరపుమైళ్ల విస్తీర్ణంలో, 60,000 మనుష్యులకు ఒక్క నర్సుమాత్రమేవుంది! మనదేశంలోవున్న ఆకొద్దిమంది నర్సులలోను సుశిక్షణ, అనుభవమున్న నర్సులు లెక్కకుమించిలేరు! మిగిలిన నర్సులంతా కేవలము రోగుల టెంపరేచరు చూడడం, రోగులకు కావలసిన వస్తువులనివ్వడం తప్పించి యింకేమీ చెయ్యలేరు!

అంతటి మహత్తరాశయాదర్శాలతో కూడుకొన్న యీ నర్సింగువృత్తి మన దేశంలో అనాదరణ పొందడానికి చాలాకారణాలు వున్నాయి. అందులోకొన్నిటిని గూర్చి ప్రస్తావిద్దాం.

ప్రస్తుతం యే 10 వక్లాసో, లేక స్కూలుఫైనలో ప్యాసైన బాలికలు నర్సింగు శిక్షణకై తీసుకోబడుతున్నారు. తగినంత పరిజ్ఞానంతో కూడుకొన్న చదువులేకపోవడం

చేత, వారు నర్సింగువిద్యలో పరిపూర్ణతనుపొంది, బాధ్యతాయుతమైన పదవులను నిర్వహించలేక పోతున్నారు. అందుచేతనే బొంబాయి రాష్ట్రంలోయుండే 24 నర్సింగు శిక్షణ కేంద్రాలలో కేవలము రెండింటిలో మాత్రమే నర్సింగు శిక్షణను యిచ్చే మహిళలు వున్నారు. మిగిలిన కేంద్రము లన్నిటిలోను పురుషులే వున్నారు. మనదేశంలో వున్నతమైన నర్సింగు వుద్యమము లేకపోవడాని కిదియొకకారణం.

దానికితోడు విరామములేని డ్యూటీలు, సరిపోని జీతము మొదలైన కారణాలచేత మనదేశంలో యీ నర్సింగువృత్తికి తగిన ప్రోత్సాహం లభించడంలేదు.

ఇంతేగాకుండా మనదేశంలోని శిక్షణపొంది, తమవిధులను నెరవేరుస్తున్న నర్సుల విషయమై మన ప్రస్తుతసంఘం చాలా దురభిప్రాయంతో వ్యవహరిస్తూవుంది.

భారతీయ నర్సుల యీదుర్దశ తొలగాలంటే మన ప్రభుత్వము కొన్ని ముఖ్యమైన కట్టుదిట్టాల్ని చెయ్యాలి. అన్యదేశాలలోలాగే మనదేశంలోకూడా నర్సింగుశిక్షణ శిబిరాలలో, అధమం యింటర్మీడియట్ పరీక్షలోనైనా వుత్తీర్ణులైతేనేగాని, ప్రవేశంయివ్వకూడదు. నర్సులకు చాలినంతజీతము, యితర సౌకర్యాలు, స్వేచ్ఛ, తగినంత విరామము వుండేటట్లు చూడాలి.—ఇది మనప్రభుత్వం చేయవలసిన పని.

ఇంక ప్రజలుకూడా - ముఖ్యంగా సోదరీమణులు - యీనర్సింగు వుద్యమానికి తగినంత ప్రోత్సాహం, గౌరవం యివ్వాలి. తగినచదువు, అనుభవము, ప్రజాసేవా సక్తివున్న సోదరీమణులు సాహసించి, యీ విషయంలో శ్రద్ధతీసుకొని, మన దేశంలోకూడా చాలినంతమంది సుశిక్షితులైన నర్సులు వుండేటందుకు కృషిచేయాలి. అన్యదేశాలవలెనే మన దేశంలోకూడా తగినంతమంది అనుభవముగల, సుశిక్షితలైన నర్సులు వుంటేనేగాని మన ప్రజారోగ్యం ఔన్నత్యాన్ని పొందలేదు. కాబట్టి, పాఠక సోదరీమణులంతా యీ విషయాన్ని ఒకసారి ఆలోచించవలసిందని నా మనవి!



# భ్రమరమా!

శ్రీమతి అల్లూరి అన్నపూర్ణాదేవిగారు

హృదయ కుసుమములోన
కలదేమొ అమృతము
అమృతపానమునకై నీవు
త్వరపడనేలా - భ్రమరమా!

హృదయ మంతకు ముందే
హరియించెనని నీవు
నిస్పృహను జెందకే - భ్రమరమా!

చిక్కె కుసుమమని
తేనె యంతయు గ్రోలి
నాశనం చేయబూని - దానిన్
కాలద్రాయకే - భ్రమరమా!

పూవు పూవున తిరిగి
హరియించి అమృతమ్ము
ఎందుదాచితి వీవు - భ్రమరమా!

తృప్తితీరక నీకు, అన్ని
కుసుమములను కూడ
అనుభవింపగ జూచుట
న్యాయమే నీకు - భ్రమరమా!

నిర్మలమైన హృదయమంతయు నీకు
ధారపోసె నని నీవు గర్వింపకే -

పూవుకూడ నీ సరిసమానమని
జన్మహక్కునిడి ప్రేమింపగదే - భ్రమరమా!

పూవులేకనే పూజలేదుగా
పూజలేకనే దునియానహీ
దాని విలువ నీమదిలో తెలుసుక
ఆదరించవే - భ్రమరమా!!

* భ్రమరము - పురుషుడు ♦ కుసుమము - స్త్రీ





# అవిశ కూర

ఇదివరకు 'గృహలక్ష్మి' సంచికలో బలమునిచ్చు 'బచ్చలి కూరను' గూర్చి చదివిన పాఠకులు ఆకు కూరలలో సామాన్య ఆరోగ్యమునకు అనుకూలమయినవి సులభముగ లభించునట్టి వానిని మరికొన్నిటిని వివరణను కోరిరి.

ఇది త్వరితముగ నెలలోపలనే మొక్కలు మొలచి నాలుగైదు మాసములకే పెద్దదగును.

ఇందుకుతోడు కాలముకూడ. ఆకు కూరలను ప్రతివొక్కరును విరివిగా భుజించిన శరీరారోగ్యము చేకూరుటయేకాక భోజనపదార్థముల ఆవశ్యకతకూడ తగ్గును. అందుచే పదిమందికి సరిపోవు పదార్థములు (ఆకుకూరలు మిక్కుటముగ - అనగా మితిమీరికాదు -) వాడినయెడలను మరొక పదిమందికి ఎక్కువగా సరిపోవును. ఈవిషయము ప్రతి ఇల్లాలికిని తెలిసినమాటయే.

అవిశఆకును మేసిన ఆవులు ఆయుర్వృద్ధి కరముగు పాల నిచ్చును. చాలా కాలము పాడి ఆవులై యుండును. అవిశఆకు ఆవులకెంత ఉపయోగమో ఆవులు మనకంత ఉపయోగములు, ఆరోగ్య ప్రదములు.

అవిశఆకునందు ప్రాణసత్త్వములును, ఖనిజలవణములు, ఇనుము మొదలగునవి యుండుటవలన ఉపవాసము చేసిన మరురోజుగాని, ఏకాదశి వ్రతసంకల్ప సిద్ధులుగాని, ద్వాదశిరోజున చాలా యిండ్లలో తప్పక అవిశ కూర చేయుదురు. మలాశయములయందు యిమిడియున్న దుష్ట పదార్థములను వెలికి మలముద్వారా త్రోయుటకున్నూ, క్రిమిసంహార ప్రవృత్తి కలిగియుండినందున క్రిమి మరల జనించకుండ శుభ్రముగావించును. జీర్ణ కోశములలోని పుండ్లు, నులిపురుగు కూడికచే కల్గు వాంతులుకూడా నిమ్మళించును.

చర్మము శుభ్రపరచుటకు ఆకుకూరలు కడు శ్రేష్టములు.

అవిశఆకును చీడలేనిదిగాచూచి మెత్తగ తరిగి వండి మెత్తపడినట్లు తెలుసుకొని నీరునువంచి బాణలిలో కరివేపాకు, ఆవాలు, మినపపప్పు, నూనె, మిరపతుంపులు, తగునట్లువేసి తాలింపు - తిరగమాత - వేపుడుగా వేయించి కూరపిండినికూడ చల్లవచ్చును. రుచిననుసరించి కొంచెము బెల్లమునుకూడ వేయుదురు. పప్పునుకూడ చేర్చిన ఆకులవాసనపోయి రుచికరముగా నుండును.

పరగడుపున యీ ఆకుకూరను అన్నముతోకూడ తొలుతనే భుజించిన రోగనిరోధన సాధనకు తోడుపడును. ఉపవాస శ్రమచే అలసినవారికి హాయి యొసంగును. మలబద్ధము పోయి శరీరము తేలిక యిచ్చును.

పువ్వులతోకూడ, పప్పువేసి పొడికూరగను, చేసుకొనవచ్చును. మంచి రుచి నిచ్చును. జీర్ణశక్తిని హెచ్చించును.

కాయలు: గింజముదరని కాయలను సేకరించి బీన్సు - గోరుచిక్కుడుకాయ మాదిరిగ కూరగ చేసుకున్న బాగుండును. కొబ్బరి తురిమివేయ వచ్చును. పులుసులో బఠాణీ, కారామడి మాదిరి ఉపయోగించుకొనవచ్చును. బాగా ఉడికించి తాలింపులోవేయు పద్ధతి ప్రకారము వేయనగును.

ఇకను తాంబూలము వేసుకొనునప్పుడు యేతమలపాకైన పండిన అవిశెఆకు అంటియుండి తాంబూలము వేసుకొనుట పూర్తిఅయిన కొంచెము కాలవ్యవధిలోనే సాక్షీగా విరేచనమగును. మలిన పదార్థములను విడగొట్టును. వైద్యరీత్యా శుద్ధిచేయుటకు అవిశఆకు పసరు పలువిధముల ఉపయోగపడును.

# బ్రతుకు తెరువు



## ఆంధ్ర స్త్రీలకు సలహాలు

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

ఈమధ్య నేను బంధువుల యింట వివాహమునకు మదరాసు వెళ్లితిని. నా ప్రయాణంలో ముఖ్యోద్దేశము వైవాహిక వేడుక అనుభవించుటకంటే స్త్రీజనాభ్యుదయులును, ఉదారులును, నారీలోక ఆరోగ్యవిజ్ఞాన దోహదకారులునునగు, శ్రీయుతులు కే. యస్. కేసరి జనకులను సందర్శించు ఘనభాగ్యంబు కొఱకే పట్నప్రయాణము చేసితిని.

ఆయన ముఖస్థముగా నాకుకొన్ని బ్రతుకు తెరువు సలహాలిచ్చి సమాజములందిచ్చెడి ఉపన్యాసముల ద్వారా నైతేనేమి, పరిశ్రమాలయములలో బాలికల కిచ్చెడి విద్యా లలితకళాగృహవిద్యలందేమి, గమనించి, ప్రబోధించ వలసినదని మాట్లాడినారు. అల్లికలు, (దారం, పేము, తాటినార వగైరాలలో చేసెడి చేతివిద్యలు) కంటే, మనకొచ్చే సామాన్య ఆదాయములో, బాడీలు, జాకెట్లు, గౌన్లు వగైరా కుట్టుకూలికిగాను, నెలకు చాలాసొమ్ము (గుడ్డకంటే కూలి అధికము) మిషన్ వానికి పోనియ్యకుండా కుట్టుపనియే మంచిది. ముఖ్యముగా లేసులు, బుట్టలు, పళ్లెములు అనే ఫేషన్లగ్గరీసు పనులకన్న (తిండి గుడ్డతర్వాతగదా పైఫేషనులు)దీనినేర్చుకొని, ఇతురులకిచ్చే కూలిడబ్బును, ఆదాయ పరచుకొనుట, ముఖ్యముగా, సామాన్యగృహిణీ లోకానికి బ్రతుకు తెరువు మార్గమనిన్నీ స్వంతముగా కుట్టుకున్న ఆనందము కల్గునుగాన అదివిధిగానేర్చుకొనుట యొకసంగతనిన్నీ నుడివిరి. తదుపరి, నిత్యావసరములగు, ఆహార పదార్థములలో పేదసంసారియై, వంటలక్కగా వీధిని పడకుండ, గౌరవముగా నింటనేయుండి, అప్పడములు, వడియములు, ఊరగాయలు, నిల్వయుండే పచ్చళ్లు, కంది, పెసర వగైరా పొడుములుచేసి, తీరిక సమయములో విస్తళ్లుకుట్టుకొని, ధనిక స్త్రీలకు అమ్ముకొనుట, ఆయన యీనెల 'గృహలక్ష్మి' లో వ్రాసినట్లే దోసగింజలు ఒలిచి, చెక్కపొడి వారికి ఆయుర్వేద వైద్యులకు అమ్ముకొనుట వగైరాలన్నియు, తాత్కాలిక ధనలాభ నిత్యవసర చేతివిద్యలేగాక, ఏరోజులాభమారోజే తీసుకొను సులభ కృత్యములని కూడ సలహా నిచ్చిరి. వీటిని స్త్రీలు రచనల ద్వారాను, సంఘముల ద్వారాను, గృహిణీ బాలిక లోకానికి అందజేయుట, తగిఫీదు

నిచ్చుట ప్రస్తుత దేశపరిస్థితులలో ముఖ్యావసరమైన బ్రతుకుతెరువు దారులని కేసరి జన కులభిప్రాయ మిచ్చిరి. ప్రస్తుతము దినుసుల ఖరీదులు విపరీతంగా పెరిగి, కొనుగోలు కష్టమై సామాన్య సంసారిపడే అవస్థయింతింత కాదు. చాలమందికిది అనుభవ జన్యమనియే నాతలంపు. దీనిననుసరించి లేని ఇల్లుదిద్దుకునే గృహిణి, ఆయమెరిగి వ్యయమన్న రీతిని, భర్తకు కష్టమొసగ కుండును. కుటుంబ మప్పుల పాలవకుండను, వీధిని పడకుండను. చీటికి మాటికి, తిండి వస్తువులకు కూడ యిరుగు పొరుగులకు చేయిచాచకుండను గుట్టుగా సంసారము వెళ్లబుచ్చుట 'గృహలక్ష్మి' కి విధాయకము. వ్యయమున కంతులేదు. "సంసారం గుట్టు, రోగం రొట్టు" అన్నారు అనుభవశాలులైన పెద్దలు. దీనిని అను సరించడానికి, ముఖ్యముగా, స్త్రీలకు బద్ధకమనెడి సోమరితనం వదలాలి; దౌర్బల్యము పోవాలి; పైగా నామోషీ యుండకూడదు. ఈత్రిగుణాత్మకరహితయే గృహమణియై వెలయగలదు.

పైనచెప్పిన మూడు గుణములు మన ఆంధ్రస్త్రీకి యున్నవి. ఎంత సామాన్య సంసారిణియైనను ప్రక్కనున్న అరవనారియో, కన్నడస్త్రీయో చేసినపదార్థములను మల బారువారి అప్పడములో, కొనుక్కొని పైమూడు జాతుల వారికి బ్రతుకు తెరువులు చూపించడంలోను, ఆదాయమునకు మించిన వ్యయము చేయుటలోను, పనులు చేసికొని జీవించువారిని అధిక్షేపించుటలోను, తానుతన స్వంతయింటికే చేసికొనుటలోకూడ నామ ర్దాగా యెంచుకొనుటలోను, ఆంధ్రస్త్రీ అగ్రస్థానం వహించును. దూరపు కొండలునును పన్నట్లు, మన ఆంధ్రపురుషులు కూడ పొరిగింటి పుల్లకూర రుచియను వాదనలో అగ్ర గణ్యులు. పెరటి చెట్టు మందుకు పనికిరాదు. మనవారి కాఫీహోటళ్లకంటే, అరవవారివి, మలబారువారివి, మన ఆంధ్రదేశములో విరివిగా వెలయుటకు మనవారి దోహదమే వారి కభివృద్ధిమార్గము లైనవి. భార్యచేతి పిండివంటకంటే, అరవసాంబారును, కాగితముల కంటే తేలికైన అప్పడములును మెచ్చుకొనుచు, ఇంటిస్త్రీలను, వంటలను నిరుత్సాహ పరచెదరు. కాని,, మన ఆంధ్రనారీ పురుషలోకమంతయు, పేదవారికి బ్రతుకుతెరువు చూపించుటకంటే, తమతమ బ్రతుకు తెరువు లెవరంతటవారే గృహకృత్యముల ద్వారా చేసికొనుట, మనవారికి బ్రతుకు దారియని నానమ్మకము. నిజమాడితినని, నన్నాంధ్ర నారీమణులు నిందించకుందురుగాక!

దోసగింజలు వలుచుటలోను, అడ్డాకుల విస్తళ్లుకుట్టుటలోను, హైద్రాబాదు కోమటి స్త్రీలారితేరిన వారుగా నేను చూచితిని. గుమ్మడి గింజలే ఒలుచుకొని తినలేని మన స్త్రీలు, దోసగింజలు ఒలిచి అమ్మగలరా? కల్ల. పొడుముగానైన దంపుకొన్న వచ్చునా! చాకిరి ఎవరు చేయగలరని బోలెడేసి దోసగింజలను పారబోసిన వారెందరో గలరు. పెద్దదాననై రుగ్మతలతో చేయలేని నాబోటి దిట్ట బ్రతుకు తెరువు సలహాలిచ్చుట హాస్యాస్పదమేకాని, ముందు ముందు గృహిణిలు కాబోయే మనబాలిక ప్రౌఢలకే యీమార్గముల సూచనయని నామనవి.

గాన, సోదరీమణులారా, చిన్నికుమార్తెలారా! సినీమా బొమ్మలతోను, నవలలతోను కాలము గడిపేవానిలో ఒకవంతునైనను గృహకృత్యములలో గడపుకొని, ఉన్నవస్తుచయముతో తిండిసంబారములను, తయారుచేసుకొని, ఒకరికిచ్చే సరుకు లాభమును, మీరే మిగుల్చుకొనుట యుత్తమ మార్గమని నా సలహా! బలమున్నప్పుడే బద్ధకమును తరిమివేయుడు.




ఈ సంచికలో అవిశకూరనుగూర్చి విపులముగా వ్రాసియుంటిమి. గృహవైద్యమునకు పలువిధముల నుపయోగించునట్టి తమలపాకులు, పోకలనుగూర్చి యించుక ప్రస్తావించుటకు గృహలక్ష్మికి ముచ్చటగునని వ్రాయనున్నారము.

తమలపాకుతీగ సర్వసామాన్యముగ అవిశతోటలలోనే పెరుగును. చెట్లు పెరిగినకొలది తీగెఅల్లుకొనుచునేయుండును. చల్లదనమునకు యితరుల చొరకుండుటకు వీలుకాని ప్రాధాన్యమయిన లతాసౌరభ్యమును, అందమును, నందనోద్యానవనముకంటే మిన్నగాంచిన అవిశెతోటలందు టూగుటుయ్యాలవలె తమలపాకు తీగల్లుకొని యుండుటచూడ లక్ష్మీనివాస స్థానమైయొప్పునట్టి స్థలమునందు మాత్రమే కానుపించును.

'తమలము సేయనినోరును' అనుమాట మరువలేము—ఔషధములకు, పానీయములకు, మాట్లాడుటకు, సభమెప్పించుటకు, సంగీతసాహిత్యములకు, వాతెర, నోరు ప్రాధాన్యము. తాంబూల చర్వణవల్లనోరు సుగంధయుతమైన పరిమళశ్వాసముప్పతిల్ల తమను రంజింపజేయుటయేకాక యితరులకుకూడ హాయినిచ్చును. పెదవులను అలంకారముగ నుంచుకొనుటకు లేనిపోని రంగుపూతలను పూయుదురు. తమలపాకు తాంబూల సేవనవల్ల కోరినంతసేపు లేక వుండవలసినంతకాలము మటుకే పరిమితిగనుండి పుష్పము వాడినట్లు ఆపెదవులరంగు వివర్ణమగును.

తాంబూలచర్వణకు సేవనకు అవసర ప్రాధాన్య సుగంధద్రవ్యముల వివరణ.

సున్నము పోకచెక్క, కాచు, తమలపాకులు, ఏలక్కాయలు, జాపత్రి, జాజికాయ, లవంగము. యించుక వచ్చకర్పూరముచేర్చిన సేవనార్హము.

ఇట్టిది అమూల్యమగు రసాయన ప్రత్యక్ష ఔషధముగను, ఉత్తేజయుతముగను, జీర్ణాశయమునకు కావలయు పోషణధారణ శక్తినిచ్చు పదార్థము లిమిడియున్నవి.

తాంబూల సంపుటిలో నొక్కొక్క ద్రవ్యమునుగూర్చి విమర్శించిన గృహవైద్య సహాయసంపదయే చేకూరును. అయిననూ చూతము.

సున్నము:—ప్రతిరోజు జీవికి ముఖ్యావసరమైనది. నీరసమునుతగ్గించును. పోషణసొంపును నిలుపును.

పోకచెక్క:—పచ్చిపోక, పీటియని రెండువిధములు. పచ్చిపోకను సన్నగ కత్తిరించి ఉపయోగించవలయును. పీటిపోకను పొడిచేసి ఉపయోగింతురు. పచ్చిపోకను వాడిన నోటియందుండు దుష్టనీరు వెలువడును నాలుక కరుకెక్కును. దంతములను గట్టిపరచును. దాహము నణచును.

పీటిపోక:—సామాన్యముగా అందరు వాడుదురు. గుణములు పచ్చిపోక మాదిరిగనే యున్ననూ రూపము మాత్రం వేరైయుండును.

ఈ రెండురకములను కాల్చి బాగుగ కాలకముందే తీసి చలార్చి మెత్తగానూరి సీసాలో జాగ్రత్తపరచి దంతధావనకు ఉపయోగించుకొనవచ్చును. పోక కాలునప్పుడు నూనెస్రవించును. అట్టినూనెను జాగ్రత్తపరచి మొండితామరగలస్థలమున ముఖ్యముగా మెడమీదను నడుములమధ్య తొంటిమీద లేచియుండుతామరను రూపుమాపును.

కాచు:—తాంబూలసేవనలో వకవేళ సున్నము జాస్తిఅయిన ఘాటునుతగ్గించును. నాలుకపూతను పోగొట్టును. రంగును నిలుపును. దంతములమధ్య వచ్చు చీమునెత్తురును ఉపశమింపజేయును.

తమలపాకులు:—లక్ష్మీప్రదమయినవి. ఆరోగ్యకరము. రుచికరము. వైద్యునికి ప్రీతికరము.

తమలపాకు లతాగణములో చేరినదేగాన లతాంగులకు యింపైనఅంగు.

బిడ్డలకు పొట్టయందు వాతము ప్రకోపించి పొట్టఉబ్బి, శ్వాసఉచ్ఛ్వాసలుకష్టతరముగనుండి మూత్రము బిగిసియుండుపట్ల తమలపాకులను వెడల్పుగలవిగ చూచి కొంచెము ఆముదమురాచి కుంపటిసెగన కాచి పొట్టపైన తొడిమె పైకివుండునట్లు వేసిన పసిపిల్లలపొట్టకు సరిపోవు పరిమాణముననే యుండును. నరములు సళ్లి, వేడిప్రవేశించి సక్రమముగ సృహగల్గి హాయిగనుందురు.

ఇంకొకవిధానము:—పురిటింటి పసికూనలకుకూడ విరేచనముకానప్పుడు, పొట్టలో మైలచేరియున్నదని తల్లులకు తోచినప్పుడు తమలపాకులకు పొడుగాటి తొడిమె వుండునదిగాచూచి దానిని ఆముదములోముంచి సామాన్యముగా ఎనిమా యిచ్చుస్థలమున అనగా గుదస్థానమున మెల్లిగజొప్పించి కొంచెముసేపువుంచిన సాఫీగ విరేచనమగును. స్వాభావికముగ ఆకునందే యిమిడియుండు ఘాటువల్లనూ నూనెయుండుటచేతను టర్పెంటైను, అయిడను నిర్ధారణగ వాడవలసియున్ననూ వయస్సు, కాలము, పరిస్థితుల ననుసరించి వాడకూడ నిపట్లయిట్టి వైద్యము నిస్సందేహాముగా చేయవచ్చును.

క్రిమిసంహార విషయములో కార్బొలిక్ ఆసిడున కంటే షుమారు 5 రెట్లుగుణమునిచ్చును.

తమలపాకురసము అజీర్ణమును పారద్రోలును, వాతమునుహరించును, కఫమును వెడలించును, క్రిమిని చంపును, గొంతునొప్పిని పోగొట్టును, స్వరమునునిల్పును. పడిశెముపట్టదు, వకవేళపట్టినను తేలికనిచ్చును.

ఇట్టిగుణములుగల ఓషధికనకనే పాశ్చాత్యులు యూరపులో చిరకాలముక్రిందటనే పరిశోధించిరి.

తమలపాకు వేసుకొని ఉమ్మివేసినను మంచిదే.

తమలపాకులు కుంపటిసెగమీద కగ్గించి రసముతీసి కొంచెము మంచినూనె కల్పిముక్కులలో వేయవచ్చును. చెవిలోకూడ వేయవచ్చును. వాతప్రకోపమువల్ల శీతగాలివల్ల కలిగిన చెడుగులనుపోగొట్టును. శాంతింపజేయును.

అన్నిటికంటే చౌక, తేలిక, సులభచికిత్సయని యనుకొనుటకు గొప్పశాస్త్రజ్ఞులు నాలుగాకులరసమును 100 గ్రాములనీళ్లకు చాలుననిరి. సులభముగ సర్వత్రకాలవిభేధము లేకగానుపించును గాన గృహవైద్యమును కల్పవృక్షమనిరి.

తలనొప్పులు యేకారణముచేకలిగిననూ కారణమూహించజాలక వైద్యులు లోపలను, పైకియేక తీరున వ్రాయు చీట్లుతీసుకొని మందులనిమిత్తముతిరిగి తిరిగి మరింత తలనొప్పులతో బాధపడుటకంటె రెండు కణతలనుతగినంత సైజులో తమలపాకును చింపి, కొంచెము మెత్తనిసున్నము స్వల్పముగారాచి కణతలకు అంటించిన తలనొప్పులుతగ్గును. (ఇది పూర్వాచార మనసేల ?)

ఇప్పుడుకూడవేసి చూడవచ్చును. వకవిషయము మాత్రిముమరువకండి, సినీమాకు వెళ్లివచ్చినతర్వాత గాని, గృహకల్లోలములలో విసుకుజెంది తలనొప్పికలిగినప్పుడుగాని, పనితొందరలలో కట్టు ఆల్లికపనులలో అలిసి చూపుచెదిరి నొప్పివచ్చునప్పుడుగాని, ఎండకు గాలికితిరిగిన సమయములలోగాని, రుచియని ఉష్ణమును కలిగించుపదార్థములు భుజించినప్పుడుగాని, తమలపాకుచీలికలకు కొంచెమునూనెయో, కొబ్బరినూనెయో, తలకురాచుకొనుతైలమో, సమయమును తటస్థించిన వాసులయినో కొంచెమురాచి అంటించవలయును.

ప్రసూతి గాంచిన పిమ్మట తొలిచూలు మలిచూలు పురిటి ఇల్లాండ్లకు పాలుపడకున్న పలుమారు తాంబూలమునములుటకు యిచ్చిన, అందుకలవేడి వల్లనూ, నములుట వల్లకలిగిన చలనము వల్లనూ, పాలిండ్లు పల్లిదాగియున్న పాలు చేపునకువచ్చి పాలుపడి శిశువులకు యిచ్చుటకు మాతృభావము వహించుటకు ఉద్యుక్తులగుదురు. ఎప్పుడూ మాతా శిశువులకు పోషణకు దైవము తోడైయుండును. కావున్న కంకణ మును, కళ్యాణమును, కళలకు కేళీవిలాసమును, అనువైన తమలమే అధిష్టాన గృహలక్ష్మియైనదన నొప్పును.

| | | |
|---|---|---|
| వక్కను మెత్తగా చూర్ణముచేసినది | 10 | గ్రెయిన్లు |
| పంచదార | 10 | ,, |

లు చేర్చి, ఆరుగ్రెయినులు గలపొట్లములుగా కట్టియిచ్చిన యెడల నీళ్లవిరోచనములు తగ్గును.

| | | |
|---|---|---|
| వక్కను పొడిచేసి చూర్ణించిన చూర్ణము | 40 | గ్రెయిన్లు |
| నిమ్మకాయ రసము | 4 | డ్రాములు |

కల్పి యెప్పటికప్పుడు జాగ్రత్తపరచి సేవించినయెడల కడుపులో నులిపురుగులు, ఏలికపాములు మొదలగునవి నశింపజేయుటకు పనికివచ్చును.

| | | |
|---|---|---|
| వక్కను పొడి చేసిచూర్ణము | 4 | గ్రెయిన్లు |
| పాలు | 4 | ఔన్సులు |

చేర్చి యిచ్చిన కొంకిపురుగులు పడిపోవుటకు పనికివచ్చును.

వక్కను కాల్చిబొగ్గు అయిన తర్వాత పొడిచేసి దంతధావన చూర్ణముగ వాడుకొనవచ్చును

| | | |
|---|---|---|
| వక్కపొడి చూర్ణము | 2 | డ్రాములు |
| కాచు | 2 | ,, |
| లవంగచూర్ణము | 30 | గ్రె |

గ్రెయినుల చొప్పున సంపుటి యొనర్చిన దంతధావనమున కుపయోగించును. నోటిపూత పోవును. దంతములు శుభ్రముగ నుండును. కమ్మని వాసననిచ్చును.

జ్వరము ఆపుటకు క్వైనైన్‌తో సమమయిన మందు:-

తమలపాకులు, మిరియములు సమభాగములుగా నూరి మిరియపుగింజ ప్రమాణము మాత్రలుకట్టి జ్వరమునకు వకగంట ముందుగా యిచ్చిన యెడల జ్వరమును రాకుండగాజేయును.

తమలపాకులు:- పుండ్లపయిన, కురుపులపైన, గడ్డలపైవేసి కట్టుటకు ఉపయోగించును.

తమలపాకుపైని వీణెలు తీయుట గొప్పనేర్పరితనము. వీణెలు తీయుచూ, సన్నని సంగీతము, మెత్తని మాటలు మొదలిడిన మనసుకు హాయి, విరామము. శ్రమ మరచి మనోభావముల వెలిబుచ్చుకొనుటకు సమయమేర్పడును.

ఇంటిపనులు, కుట్టుపనులు, పాకకళ, కూరలు పచ్చళ్లు-గృహవైద్యము, శిశుపోషణ, స్త్రీఉద్యమములు, లలితకళలు, రాజకీయచర్చలు, మహిళాముచ్చట్లు, చర్చించి, విశదీకరించి విపులముగా వ్రాయుటకు తోటి అక్కచెల్లెండ్రకు అందజేయుటకు మా "గృహలక్ష్మి"దే అగ్రతాంబూలము. నేడేకాదు, ఎప్పుడునూ-ఇవ్వండి, ఇప్పించడి, గైకొనండి.

## గచ్చకాయ

వరుస జ్వరమునకు:- పసుపుగుడ్డలో పెట్టి ముడివేసి చేయితిరుగునట్లు పొడుగు గుడ్డలోకట్టి కుడిచేయి దండకు కట్టిన విడువని వరుసజ్వరములు తగ్గును.

గచ్చకాయపప్పు 1-తులం — శొంటి చూర్ణము 1-తులం

వీటిని తమలపాకురసముతో నూరి మిరియపుగింజల ప్రమాణము మాత్రలుచేసి వరుస జ్వరముఅయినా, వరుస తప్పినా మరువక సేవించిన జ్వరము తిరిగి మరలరాదు,

### చలిజ్వరములకు

గచ్చకాయ పప్పు 1-తులం — జీలకర్ర 1-తులం

నీళ్లతో చేర్చి మెత్తగానూరి మాత్రలుకట్టి పూటకు 1 మాత్రచొప్పున దినమునకు మూడుసారులు మంచినీటితో యివ్వవలెను.

### జ్వరములకు (శ్లేష్మవాత)

గచ్చకాయపప్పు 1-తులం — మిరియాలు 1-తులం

రెండునుకల్వి కలబందరసముతో మెత్తగానూరి శనగగింజంత మాత్రలుకట్టి దినమునకు రెండుసారులు యివ్వవలయును.

ఏలికపాములు, నులిపురుగులు నశించుటకు:-

గచ్చకాయపప్పు 1-తులం — మోదుగమాడలు 1-తులం

చేర్చి బెల్లముతోనూరి శనగగింజ ప్రమాణము మాత్రలుచేసి పిల్లలు, పెద్దలు వాడుచున్నయెడల ప్రేగులందు అంటుకొని క్షీణింపచేయు పురుగులు చచ్చి,మలముద్వారా పడిపోవును. ఈపురుగులుండుటవలన పిల్లలు శుష్కించెదరు. దీనికే Rickety పిట్టపారుటయనికూడ అందురు.

క్రిమివృద్ధిఅయినకొలది వాంతులుకూడకలుగును. చివరకు ప్రేగులయందు దీర్ఘమయినవ్యాధియేర్పడును.

పురాణ జ్వరములచే ఆకలిమందగించుట, శుష్కించుట, లివరువ్యాధి అనిగుర్తెరిగినప్పుడు

గచ్చకాయపప్పు 1 తులం

సునాముఖిఆకు 1-తులం — శొంఠి 1-తులం — మిరియములు1-తులం

అన్నియు సమభాగములుగతూచి మెత్తగా వేడినీటితోనూరి మినపగింజప్రమాణము మాత్రలుకట్టి యిచ్చిన సుగుణమిచ్చును.

పనిపాటలు లేనప్పుడు పిల్లలు, పిల్లతల్లులు వారువీరననేల అందరు అల్లారుముద్దున గచ్చకాయలతో యిచ్చవచ్చినట్లు ఆడుకొనవచ్చును.




అమ్మా అమ్మా
అదుగోనమ్మా
చూశావమ్మా
జాబిల్లి

◆ ◆

మబ్బుల్లోపల
దాగి దాగి
పరుగిడుతోందీ
జాబిల్లి
పరుగిడుతోందీ
జాబిల్లి

◆ ◆

రాతిరిపూటా
వెన్నెట్లోనూ
బబ్బుంటేనూ
కనబడుతుందీ
జాబిల్లి

◆ ◆

అందరి తోనూ
నవ్వి, నవ్వి
ఎన్నో నవ్వి
నవ్విస్తుందీ
అందరినీ
నవ్విస్తుందీ

◆ ◆

అమ్మా అమ్మా
అదుగోనమ్మా
నల్లటిచెట్టూ,
చెట్టుకిందనే
ముసలమ్ముందీ
రాటంవుందీ
అన్నీ ఉన్నాయ్
రాటంతిప్పి
దారంతీసీ
క్రిందకి వదిలిందీ
మళ్లీ మళ్లీ
దారంతీసి
వెన్నెల్లాగా
దారంతీసీ
కిందికి వదిలిందీ

◆ ◆

జాబిల్లిని
తెచ్చిస్తావా
దేనికి అంటే
జాబిల్లీ మా
జవాను బొమ్మకు
డవాలుబిళ్లా

◆ ◆

అమ్మా అమ్మా
అన్నం తింటూ
ఆగంచేస్తే
అదుగో నంటూ
తెచ్చిస్తా నన్నా
వమ్మా

◆ ◆

మబ్బుల్లోనే
దాక్కుందమ్మా
అదుగోనమ్మా
అదుగో అదుగో
జాబిల్లి.

అనిశెట్టి వేంకటసుబ్బారావు.

# రావుకమిటీ శిఫార్సులు

శ్రీమతి బోడపాటి అలివేలమ్మగారు.



బహుపత్నినిరోధచట్టము విడాకుల చట్టము మొదలైన వన్నియు తప్పకుండా చట్టముగా వచ్చి కష్టపీడితుల కష్టాలు శీఘ్రముగా గట్టెక్కించ వలసియున్నది. మొట్టమొదట స్త్రీలకు సంపూర్ణ స్వతంత్ర్యము వచ్చినయెడల ఇటువంటి వన్నియు వెంటనే చాలా మట్టుకు తగ్గిపోగలవు. మనము సర్వ్వజనులకు సహాయము కలిగించేవి, ముందుగా చట్టము గావించునట్లు ఆందోళన చేయవలసి యున్నది. అందులో రావు కమిటీసిఫార్సులు ఒకటి.

ఇదియెంతవరకు స్త్రీలకు న్యాయంచేసింది? మనదేశంలో మన స్త్రీలదురదృష్టము వలన స్త్రీలకు ఏవిధమైన ఆస్థిహక్కులు లేకుండాచేసి పురుషులు నిరంకుశంగా పరిపాలన చేశారు? స్త్రీ పురుషుడి కరుణ మీద ఆధారపడియున్నది. ఈ అన్యాయమేమి అని అడుగుతే 'స్త్రీలకు అసలు ఆస్థులెందుకు? స్వంతంగా వ్యవహరించుకోలేరు; బంధువులలో మొగవారి కెవ్వరికైనా ఒప్పచెప్పినట్లయితే వారుమోసగించి సొమ్ము తినేస్తారు; చిన్నప్పుడు తల్లిదండ్రులు ఆపైని భర్త, ఆవెనుక కొడుకులు స్త్రీని రక్షించాలని యుండనే యున్నది. అందుచేత స్త్రీ ఆస్తికి అర్హురాలుకాదు; ఆస్థి అక్కరలేదు;' అన్నారు. కాని, కాలం యెల్ల కాలము ఒక్కలాగే వుండదు. కొంతమంది వుదార పురుషులు తమతో సమభాగినులై కష్టసుఖాలు పంచుకొనే స్త్రీలకు విద్యలేక పోవటం ఆస్థిలేకపోవటం అన్యాయమని ఘోషించారు. దానితో మహిళాభ్యుదయము ప్రారంభమై యూరకొన్నది. సహృదయంతో చేసేకృషి సజ్జనా మోదంపొందక పోదను విశ్వాసంతో న్యాయమైన ఆస్థిహక్కులు మాకివ్వండని మహిళా సమాజములద్వారా పత్రికద్వారా ఆందోళన లేవనెత్తారు. దానిఫలితమే రావుకమిటీ నిర్మాణము.

1937 సం||లో ఆస్థి ఇవ్వడంతప్పకుండా న్యాయమే నంటూ ఒప్పుకొని, భర్తతాలూకు స్థిరాస్థిలో భార్యకుహక్కు కలిగిందని కేంద్రశాసన సభవారు అంగీకరించారు.

అంగీకరించుటమైతే అంగీకరించారు. కోర్టువిచారణలకు వెడితే ఈహక్కు సాగుభూములకు వర్తించదన్నారు. ఎందుకు వర్తించదూ అంటే తండ్రిఆస్థిని కొడుకులు పారంపర్యంగా పంచుకుంటూ వుంటేనే భూములు చిన్నచిన్న చీలికలై పోతున్నాయి. ఇకకూతుళ్లు కూడా పంచుకొంటూవుంటే గోచిలే అయిపోతాయి అన్నారు. కనుక స్త్రీలకు భూమిహక్కు లేదన్నారు. ఇస్తున్నట్టే ఈచేతిలో యిచ్చి ఆచేతిలో తీసుకొన్నారు. ఇంతకన్నా ఇవ్వటం మాకిష్టంలేదు అంటేబాగుండిపోను! అయినా స్త్రీలు వూరుకోలేక మాకు భూములుకూడా పంచుతేగాని ఆస్థిహక్కుయిచ్చినట్లు ఏలాగవుతుంది, మాకు పురుషుడితోసమానంగా చరస్థిరాస్థులలో సమానంగా పంచండి. వెనుక రైతు ఋణవిమోచన చట్టము అమల్లోకి వచ్చినప్పుడు శాసనం ఆవకముందు నిర్ణయించిన తేదీ మొదలు వర్తించేటట్లు చేశారు. మాకుకూడా 1937 ఏప్రిల్ 14 తేది నుంచి సమానంగా ఆస్థిహక్కులు యివ్వాలని ఆందోళన చేయడం మొదలుపెట్టారు. ఆకథ అలావుండగా

ఈమధ్యను ఏదోచాలావుదారంగా ఇస్తున్నట్లుగా స్త్రీలకు ఆస్థిపై దాన, ధర్మ, విక్రయాది సమస్త హక్కులు యివ్వవలసినదిగానూ అదిచాలా న్యాయంగానూ వున్నట్లు హిందూ లా కమిటీవారు శిఫార్సు చేశారు అన్నారు. నిజమే కాబోలునని తీరాచూస్తే, ఏముంది? అంతావట్టిది, అంతా ఆడంబరమే, అంతా గమ్మత్తు. మునుపటి భాగవతమే.

తండ్రి వీలు వ్రాయకుండావుంటే తండ్రిఆస్థిలో కూతురుకు కుమారునకిచ్చే భాగంలో సగం యివ్వాలట. వివాహితకు హక్కులు వేరువేరుగా వున్నవి. ఎంతచక్కగా వున్నది? చూడండీ! విల్లువ్రాయకుండా వుంటేనట - విల్లు ఎందుకు వ్రాయరో కాస్తచెబుతారూ? తప్పకుండావిల్లు వ్రాస్తారు. ఇన్సూరన్సు చేసినపుడు వ్రాయటంలేదూ ఎవరికి చెందవల్సినదో! అందరూ అకాత్తుగా గుండెఫేలయిగాని, పాముకరచిగాని చని పోవరుగదా! విల్లువ్రాయకుండా అన్నమాట ఎప్పుడైతే పుడుతుందో అప్పుడే జాగర్త పడతారు.

పైగాకూతురికి తల్లి ఆస్థిమీద ఇదివరకు పూర్తిహక్కు వుండేది. ఇప్పుడు కొడుకుకు కూడా వాటాలో సగము ఇవ్వాలిట. పురుషులకు హక్కులు యింకా యెక్కువ చేసుకుంటున్నట్లున్నారు. పూర్వము పిత్రార్జితమునకు మనుమడు పుట్టుకతోనే హక్కుదారుడై వున్నాడు. అదిబాగాలేదని "మిటాక్షరీ-లా" అనేది రద్దుచేసుకొని "దాయభాగా-లా" దేశమంతటా అమలు చేసుకుంటారట. దీని వలన పురుషులకు స్వార్జితమేకాకుండా పిత్రార్జితం ఇష్టంవచ్చినట్లుగా చేసుకోవచ్చును. ఈవిధంగా రావు కమిటీ ఇష్టమైతే అనుసరింపదగునట్లు చేసిందేగాని నిర్బంధమేమీలేదు! ఇదిచట్టము కానక్కరలేదు.

పూర్వం వేదకాలంనుండీకూడా ఆడపిల్లలకు తలిదండ్రులు శక్తికొద్దీ ఇష్టంతో ఎంతోఆస్థి అరణంగా యిస్తూ ఆదరించి, ప్రేమించి, కష్టసుఖాలకు అండగా నిల్చేయున్నారు. ఆతల్లిదండ్రులు లేనపుడు విధి బలమై భర్తగాని పిల్లలుగాని లేనపుడు ఆగర్భశ్రీమంతులైన ఆడవారు ఆస్తులు అన్యాక్రాంతములై అనాథులై పోతున్నారు. అది ఒక్క స్త్రీలోకానికేకాదు, పురుషులకు కూడా సంబంధించిన సమస్యే. ప్రతి వాళ్లకు చరాస్థి యెంతవుంటుంది? సంసారములు దిద్దుకొని చదువులు చెప్పించి శుభకార్యములుచేసి యెంత నిలవ చేయగలరూ? తట్ట బుట్ట పంచుకుంటే ఎంత? పంచుకోక పోతేయెంత? పిత్రార్జితమునకు మనుమడు పుట్టుకతో ఎట్టిహక్కుదారుడు కాగలడో, మనుమరాలు కూడా పుట్టుకతో అట్టిహక్కుదారుగా చరస్థిరాస్థిలో సమానమైనదానిగా చేయగలిగిన యెడల రావు కమిటీన్యాయము చేసినట్లుకాగలదు. ఇప్పుడు మిగిలినది, రావుకమిటీ యిచ్చినది హుళ్లికిహుళ్లి - సున్నకు సున్నా. స్త్రీలందరూ బాగుగా రావుకమిటీని గురించి పెద్దగా చర్చించి న్యాయముకొరకై ఆందోళన చేయగోరుచున్నాను. ముందు సమానహక్కు చట్టమైనట్లయితే సంఘం సహజంగా, సజీవంగా, విశాలమై స్త్రీ పురుషులు సమానమనే దృక్పథంతో వున్నతి పొందగలుగుతుంది.



# ఆదర్శ నాట్యసోదరీమణులు

## లలిత - పద్మిని - రాగిణి.



మొన్న 22-6-47 తేదిన St. Mary's Hall లో ప్రసిద్ధి చెందుచున్న తిరువాంకూరు సోదరీమణులైన లలిత, పద్మిని, రాగిణి వారినాట్యము జరిగినది. వీరు ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ఉదయశంకర్, గోపీనాథ్ వారి శిష్యురాండ్రు. మహాలింగం పిళ్లెగారి వద్ద భరత నాట్యం అభ్యసిస్తున్నారు. వీరి నాట్యములోని ముఖ్యభాగములు - రంగపూజ, మోహన మురళి, వసంతోత్సవం, పరంబాట్టి నాట్యం, రాధాకృష్ణ, గిరిజా కళ్యాణం మొదల గునవి. ఈ పై నాట్యములను చక్కగా, ఆనందకరముగా చేసి రసికులను ఆనందసాగరము నందు ముంచి వేసిరి.

నాట్యమునకు కావలసిన అంగసౌష్టవము, సుకుమారము, ఒయ్యారపు చూపులు మొదలగునవి వీరియందు స్వాభావికముగ పూర్తిగ యిమిడియున్నందున వీరు త్వరలో నాట్యోన్నత శిఖరమును చేరెదరని రసికులయొక్క గట్టి అభిప్రాయము. వీరి నాట్యబృంద ములో ముఖ్యురాలైన లలితయును; మంచి చురుకుదనము, సుకుమారము యున్న పద్మినియు, లేతపాలవంటి ముఖముతో చిన్నబిడ్డవలె ముద్దుగానుండు రాగిణియును - ఇటువంటి ఈ ముగ్గురూ, నాట్యమునకు అన్ని విధముల శోభనిచ్చువారై యున్నందున ఆ రోజున రసికులు తాము St. Mary's Hall లో యున్న సంగతి పూర్తిగ మరచిపోయిరి.

ఆ రోజున వీరి నాట్యభాగములలో యేది చాలా బాగున్నదని చెప్పుట చాల కష్టము. ఏలన, ఆరంభమునుండి ఆఖరువరకు రసికులకు విసుగుయనునది పుట్టించక, టైము అగుటయు తెలియనియ్యక అంతచక్కగా నాట్యముచేసిరి. కొంచము సేపుకూడా వృధా చెయ్యలేదు. వీరికి తగిన సంగీతముకూడ ఆ రోజునకుదిరి ఆ నాట్యమునకు మరింత శోభ నిచ్చినది.

నాట్యమయిన తర్వాత వందనము లర్పించుటకువచ్చి చెప్పినవారివలె పై సోదరీ మణుల నాట్యము ప్రపంచ ప్రఖ్యాతిచెందవలెనని రసికులందరి అభిప్రాయమై యుండెను. ఆ గొప్పఖ్యాతిని సంపాదించుకొనుటకు కావలసినంత శ్రద్ధ తీసికొని, కృషిచేసెదరని మేమందరము విశ్వసిస్తున్నాము.

'మనోరమ'

ఏకాంకిక:

# దత్తతా?

శ్రీ వోగేటి శివరామకృష్ణ శాస్త్రిగారు.



వెంకాయమ్మ:—అప్పుడే ఎనిమిదిగంటలవుతోంది. అబ్బాయి ఇంకారాలేదేం చెప్మా, పట్నంబండి వెళ్లి అరగంటైందే ఈబండిలో దిగలేదా ఏమిటి?

(ఇంతలో బయట బండిచప్పుడు; చంద్రం, రోహిణీ ప్రవేశం.)

'మాటలోవచ్చావు నాయనా, వెయ్యేళ్లాయుష్షు, రాత్రంతా నిద్రలేదు కాబోలు, కళ్లంతాఎర్రగా వున్నాయి. ఈ అమ్మాయిఎవరు? లక్ష్మీదేవిలావుందే!'

చంద్రం:—ఈమెనాక్లాసుమేటు, అంటే, నాతో చదువుకునే అమ్మాయి అన్నమాట. పేరు మిస్ రోహిణీదేవి. ఇల్లా విశాఖపట్నం వెడ్తూ నేనుబలవంతంచేస్తే ఇక్కడ దిగింది. సరేకాని, కాస్త కాఫీపెట్టు, రాత్రంతా నిద్రలేదు, తిండిలేదు.

వెంకాయమ్మ:—అయ్యో, నాయనా. భోజనంకూడాలేదా; కాఫీకాచి సిద్ధంగానే వుంచాను. దొడ్లో వేణ్ణీళ్లుపెట్టాను; స్నానంచేసిరా.

చంద్రం:— రోహిణీ, నీవుతర్వాతచేస్తావా; ఇప్పుడేనా ?

రోహిణి:— నీవుచేసిరావోయ్.

(చంద్రం నిష్క్రమణము)

వెంకాయమ్మ:— అమ్మాయీ, నీపేరేమిటన్నావు?

రోహిణి:— రోహిణీదేవి.

వెంకాయమ్మ:— ఈపట్నవాసంపేర్లూ, పట్నవాసం మనుష్యుల్లానే విచిత్రగావుంటాయి, రోహిణి—ఏమిచక్కని పేరు; చంద్రుని భార్యకదూ; చంద్రుడికి బహుదగ్గరలోవుండేనక్షత్రం. నువ్వూ మావాడుచదివే తరగతేకదూ?

రోహిణి:— అవునండి.

వెంకాయమ్మ:—మీతండ్రిగారేమి చేస్తున్నారు?

రోహిణి:—విశాఖపట్నంలో డిప్టీకలక్టరు చేస్తున్నారు.

వెంకాయమ్మ:— అంటే తాసిల్దారు కన్నగొప్పవుద్యోగం కదూ; మాచిన్నప్పుడు తాసిల్దారు గుర్రంమీద వచ్చారంటే కరణంకూడా పరుగెత్తుకుని వెళ్లేవాడు. తాసిల్దారు గుర్రంనుంచే కాగితాలు, దస్తరాలు, పరీక్షచేసేసేవాడు. పెద్ద పెద్ద వెలమదొరలు చేతులు కట్టుకుని నిలవబడివుండేవారు. ఆదర్జాయే వేరు; ఊరంతా అట్టుడికినట్టుకదేది అజమాయిషీ జరిగినంతసేపు.

రోహిణి:— ఇప్పుడేముంది; మనుష్యుల విలువలే మారిపోతున్నాయి; సృష్టిలో వచ్చేమార్పులు మన ఊహాశక్తికి అతీతాలు —

వెంకాయమ్మ:—నిజంచెప్పావు, తల్లీ, అదిగో అబ్బాయి వచ్చాడు; రా, మరి, నీళ్లుపోసుకుందువుగాని.

(రోహిణి, వెంకాయమ్మ నిష్క్రమణము)

చంద్రం:—వీళ్లిద్దరూ ఏదో సంభాషణలో పడ్డారే, రిజిష్టరీ మారేజి సంగతి చెప్పొద్దన్నాను; చెప్పిందా ఏమిటి! అబ్బే, అల్లా చెప్పదు; టాయిలెటుబాక్సు రోహిణి పెట్టిలో వుందా, ఏమి?

2 వరంగము

(చంద్రం, రోహిణి ప్రవేశము)

చంద్రం:—ఇదిగో, బండి టైము దాటిపోయింది; ఏదో, నామకహా స్టేషను వరకూ వెళ్లి తిరిగివద్దాం. బండిదాటిపోయినట్లు.

రోహిణి:— ఈముసుగులో గుద్దులాట నాకుచాలా సిగ్గుచేటుగావుంది; మీఅమ్మ చూస్తే చాలా అమాయకురాలు; మీరామెను మోసగించాలని చూస్తున్నారు; ఇది నేను వొప్పుకోను.

చంద్రం: నాకుమట్టుకు ఇట్లాగవుండడం సంతోషంగావుందా! ఈవొక్కసారి నేనుచెప్పినట్లు చేయి; తర్వాత నేనుచెప్పేస్తాను మాఅమ్మతో, నిన్నుతప్ప ఇంకెవర్నీ పెళ్లిచేసుకోలేనని; అసలు, నిన్నెల్లా మోసగించ గలను? — అమ్మా, రోహిణిని బండెక్కించి వస్తాను.

(వెంకాయమ్మ ప్రవేశము)

వెంకాయమ్మ:—ఇప్పుడేంబండి; టైమైపోలేదా; ఏంఅమ్మా, ఇంకో రెండురోజులాగి వెడుదువుగాని.

చంద్రం:—బండి టైంసరిగాఅయింది; ఆగడానికి వీల్లేదంటోంది?

రోహిణి:—మళ్లీ వారంరోజుల్లో వస్తాను మామ్మగారు, మళ్లీవస్తాను కదండి.

వెంకాయమ్మ:—చీర, రవికెలగుడ్డ తెచ్చి పెట్టును;

(చంద్రం, రోహిణి నిష్క్రమణము)

వెంకాయమ్మ:—రోహిణి బహుచురుకైనపిల్ల. ఆకళ్లలోనే జీవశక్తితాండవిస్తూవుండేది; నేనుచిన్నప్పుడు అల్లాగేవుండేదాన్నట.

(నేత్రాల్లోవిషాద విభ్రమరేఖ)

మాచంద్రానికి ఇల్లాంటి అమ్మాయినే పెళ్లిచేయాలి. కాలేజీలలోకూడా ఇల్లాంటి అపరూపమైన పిల్లలుంటారు కాబోలు. ఒక్కరోజులోనే ఎంతసన్నిహితంగా సంచరించింది! ఇదివరకు స్త్రీపురుషులమధ్య ఇల్లాంటి స్నేహాలు వొప్పుకునేవారూ? అంతా రోజులమార్పు.

(తెరపడును.) —సశేషము.

# మా రాధ ధైర్యం

షేక్ మస్తాన్, బందరు.

మారాధకు నాకు ఏనాడు వివాహమైందో ఆనాటినుండి ఈ నాటివరకు ఒక్కరోజైన ఒక మాటగాని ఒక కలహముగాని వచ్చి ఎరుగదు. నేనుచేసేది ఒక సామాన్యపు గుమాస్తా పనియైనా మారాధ మాత్రం నన్ను ఎంతో ప్రేమించి ఎంతగానో ఆరాధిస్తుంది. ఒకనాడు నేను ఆఫీసునుండి రావడం ఆలస్యమయితే సరి నాకొరకు ఎదురు చూస్తూవుంటుంది. నన్ను చూడగనే ఆమెకు స్వర్గంలో సౌఖ్య మొందినంత ఆనంద మొస్తుంది. ఒకనాడు మాఅధికారికి బదిలీ యగుటచే మాతరుపున వారికి విందొసగుటకుగాను నేను ఆరాత్రి పది గంటలవరకు ఇంటికి రాలేదు. అప్పటికే మాతల్లి, మాచిట్టిపాప వసుంధర అంతా నిదుర పోతూన్నారట. మావీధి ఒక చిన్న సందగుటచే ఆదారి అందరికి సదుపాయంగాక పోయినా, ఈ నాటికరువుకు ఆహుతి యగుచున్న దొంగలకు మాత్రం మావీధి సదుపాయంగా వుంది. సరే నేనురావడం ఆలస్యమగుటచే ఒక దొంగ మావీధినే తారట్లాడడం అదివరకే మారాధ చూచి, అతనిని నిగాపట్టుచు ఇంటిపనులు చక్కపర్చుచు ఎంతో చురుకుగా వున్నదట. సరే, ఎలాగైతేనేం రాత్రి పదిగంటలగుసరికి మావాళ్ళంతా పవ్వళించి గుర్రుపెడుతున్నా మారాధమాత్రం తన రెండు కళ్ళను నాలుగుకళ్ళగా వుపయోగించి వానిచర్యలన్ని కనిపెడుతూనే వుందట. వాడు మావీధినే లక్ష్మీనారాయణగారి అరుగుపై పరుండినట్లు నటించుచు పది గంటలగుసరికి మాగోడ ప్రక్కగా నడచుచు దొడ్డిగుమ్మందగ్గర ప్రవేశించే సరికి మారాధ నిదానంగా లేచి, దొడ్డిలో స్నానాల గదికి ఇంటిలోపలిగది గొళ్ళెము తాళము వేసి దొడ్డివైపు గుమ్మపు గొళ్ళెం తీసిపెట్టి ఎంతోధైర్యంతో ఇంకొక తాళంచేతపట్టుకొని వానిరాక కొరకు ఎదురు చూస్తూందిట. మారాధ స్నానాల గదికి ప్రక్కనే వున్న పాతబొంగులు ఇంకా యేవేవో వున్న వాటిసందున దాగొన్న సంగతి వాడు గమనించక వానిధ్యాసలో వాడు గోడదూకి నూతివైపు కెళ్ళి, బాదంచెట్టు వెనుకనుండి చెట్టునీడనుబట్టి నిదానంగా అడుగుల్లో అడుగులేస్తూ డాబాపైకి చూచాడట. పైన అంతకుముందే మారాధ బెడ్ లైట్ పెట్టివచ్చుటచే ఆలైట్ వెలుతురు కనబడుచున్నదనియో యేమో అక్కడే పది నిముసాలపాటు నిల్చొని, మళ్ళీబయలుదేరి స్నానాల గదిదాపుకుచేరి నిలుచున్నాడట. అప్పటికి మారాధకు ఒళ్ళు నీళ్ళై కారజొచ్చిందట. అరుద్దామాఅని ఆపుకొని శిలావిగ్రహమువలె చూస్తూందట. వానిమీసములు మెలితిరిగి ఎర్రటి కన్నుల కాంతిలో పున్నమ చంద్రుని కాంతిలో అలాభయంకర రూపంగా వున్నాడట. మారాధ నోటమాటరాక కళ్ళుమూసుకొని ఆలోచించిందట. ఇకవీడు తనను చూచినట్లు దగ్గరకువచ్చి ఏమో చేస్తాడని గ్రహించి కళ్ళుతెరచి చూచేసరికి వాడు స్నానాల గదితలుపు తీసి లోన ప్రవేశించి మళ్ళీ యధాప్రకారం తలుపును ఓరగా వేసినాడట. ఇకమారాధకు వెయ్యి ఏనుగుల బలమొచ్చిందట. నిధానంగా వెళ్ళి ఆతలుపును అతి జాగ్రత్తగాలాగి చేతిలోని తాళాన్ని వేసేసిందట. పరుగు పరుగున వెళ్ళి చెంబునీళ్ళుతాగి మాఅమ్మను నిదానంగాలేపి సంగతంతా చెప్పి నాకొరకు వీధిగుమ్మంలోకి వస్తుంది కాబోలు. నేనూ అప్పుడే టీ. గీ., పుచ్చుకొని వస్తున్నా, నాయుడుగారి ఇంటి దగ్గరవున్నా చూచా, పాపం మారాధ నాకొరకే చూస్తుందని. ఇంకో రెండడుగులు తొందరగావేసి గుమ్మంలో కొచ్చానోలేదో ఎంతో హృదయం కంపమెత్తిపోయేటట్లు ఈవిషయమంతా పూసగుచ్చినట్లు నాతోచెప్పింది. అప్పుడే నలుగుర్ని పిలచి వానిని జాగ్రత్తగా పట్టుకొని పోలీస్ కి హాండోవర్ చేశా. చూచారా, సోదర సోదరీ మణులారా! మారాధ ఎంతధైర్యంగా ఎంతవుపాయంగా దొంగను పట్టుకొన్నదో! మనలో అంటే మనస్త్రీలలో నూటికి యేఇద్దరో ముగ్గురో రాధవంటి సోదరీమణులువున్నారు. దొంగయైనా దొరయైనా ధైర్యమే ప్రధానము గాన మన సోదరీమణులంతా ప్రతిప్రాణాపాయ సమయంబునందు ధైర్యముగలిగి వుండవలెనని కోరుచున్నాను.

—(o)—

# శ్రీమతి సౌభాగ్యవతి దాసరి బాలాత్రిపురసుందర్యంబగారు.

ఇప్పుడు యాంధ్ర స్త్రీసందోహమున నీమెయొక సహజ కవిత్వశక్తి సంపన్నురాలుగ భాసిల్లుచున్నది. ఈయమజెప్పిన గ్రంధమగు, శ్రీరామశతకమునకు గ్రంధప్రశంసగ నొక పీఠికను ప్రసిద్ధాంధ్ర కవయిత్రియు స్త్రీజనాభ్యుదయ నిర్వహణ కేసరి శ్రీ కోట వర కేసరిగారి స్వర్ణఘంటా కవితకరకంకణ బహూకృతి నందిన మేటియు శ్రీమతి చిలకపాటి సీతాంబగారు దాదాపు పదమూడేండ్లక్రిందట వ్రాసినారు. ఆపీఠిక ఆగ్రంధమున ముద్రితమై యున్నది. అందు ప్రస్తుత కవయిత్రిగారినిగూర్చి శ్రీమతి సీతాంబగారు వ్రాసిన యంశములు సంక్షేపములును ప్రశస్తములుగను యున్నందున ఆపీఠికయె యిందును గూర్పబడినది.

"ఈశతకమును (శ్రీరామ శతకమును) రచించినవారు శ్రీబాలాత్రిపుర సుందరీదేవిగారు. వీరు గుంటూరు మండల వాస్తవ్యులు. ఈ కవయిత్రి పరాభవ సంవత్సర శ్రావణ బ. ౧౧ లు బుధవారమునకు సరియగు హూణశకము 1906 ఆగష్టునెల మే 15 దిన జన్మించిరి. జననియగు శ్రీమతి నాగమణ్యాంబగారియొద్ద నీమె సంగీత సాహిత్యాది విద్యలనభ్యసించిరి. అనంతకల్యాణగుణ పరిపూర్ణుఁడగు భగవంతునిగూర్చి వందలకొలఁదిగ భక్తిరసంబు వెదజల్లెడి కీర్తనలు విరచించి యానందించిరి. ప్రస్తుతము నెల్లూరు స్టేషనరీ సబ్ మేజస్ట్రేటుగారైన మ_రా-రా-శ్రీ దాసరి శ్రీరాములు నాయుఁడుగారి ధర్మపత్ని. వీరియిష్టదైవము రామచంద్ర మూర్తియగుఁట తనకు ప్రత్యక్షదైవమగు భర్తనామమును శ్రీరామచంద్రుని స్మరణతో నధ్యవసించి యీ పతి ప్రాణ రకార ప్రాస శ్రీరామకంద శతకమొకటియు రామచంద్రశతకమొకటియు రచించిరని తోచెడిని.



ఈ సాధ్వి కవిత మృదు మధుర పదలలితమై భక్తి భావ విలసితమై యొప్పుచున్నది. ఈమె వాణి నవీన భావకవితలవలె నిచ్చవచ్చిన గతులఁ బడిపోక శిక్షితులగు పూర్వకవుల యనుశాసనములవలె మంచిమార్గముల సరళముగ నడచుచున్నది. ఇందే పద్యమును జదివినను పరమపద సోపానములై భక్తిరసము చిప్పిలుచుఁ గరతలామలకములై యున్నవి. భక్తిరసపూరితములగు గ్రంధముల రచించిన శ్రీ తరిగొండ వేంగమాంబ, గుండు అచ్చమాంబ, కాంచనపల్లి కనకమ్మగార్లవలె నీమెయు దన వాక్కుసుమముల శ్రీ రామచంద్రునిం బూఁజించి కృతార్థయైనది. ఈమె వయసునఁ జిన్నదియైనను దనహృదయ మితరచింతలఁ జొరనీయక పరమమగు భక్తి విషయముననే తన కవితా ఝురిఁ బ్రవహింపజేయుట శ్లాఘ్యము.

విద్యావిషయమున వెనుకఁబడి మాధ్యదశలోనున్న స్త్రీలలో నిట్టిరత్నములు పొడజూపుట గ్రంధ రచనలయందుఁ బురుషులతో

పాటు స్త్రీలును సారస్వత పీఠమలంకరించి భాషాసేవకుం దోడ్పటుట కడుంగడు ముదావహంబు. ఇట్లే బాలికా బాలకులకు జ్ఞానాభివృద్ధిదములగు నుత్తమగ్రంథములు రచించి పెద్దల యాశీస్సులకుఁబాత్రయగు నీమె సంతతారోగ్య సౌభాగ్య పుత్రపౌత్రాభివృద్ధిఁగలిగి చిరకాల మిటుల భాషాసేవఁ జేయుచుండునటుల దైవ మనుగ్రహించుగాక. విద్యాశాఖాధికారులు నీమె కవితను సమాదరింతురుగాక."

కందముజెప్పినవాఁడె కవియనుఖ్యాతి యీ శ్రీరామ శతకమువలన నీకవయిత్రి లెస్సగా గడించినది. అందునను ఆద్యంతము రకారప్రాసముతో నిర్వహించినది. నెల్లూరులో కొంతకాలముక్రింద వెలయుచుండిన శ్రీవాగ్వల్లియను అముద్రిత గ్రంథప్రణాళి యందీశతకము 1934 న డిశంబరులో పదునొకండవ కుసుమముగ పైనఉదాహరించిన శ్రీమతి చిలకపాటి సీతాంబగారి పీఠికతో ప్రకటింపబడినది. ఇది ఆ కవయిత్రి ప్రథమ రచనగాదు. ఆమె ప్రథమరచన శ్రీరామ నక్షత్రమాలయను నిరువదేడు పద్యముల చిన్నకబ్బముఅని ఆమెయె చెప్పగ తెలిసినది. ఈచిన్న పొత్తమున శ్రీరామ స్తవముండుటయేగాక నానావిధ పద్యములును గూర్పబడినవి. ఈ ఇరువదియేడింటిలో మత్తేభ శార్దూలములు, చంపకోత్పల మాలికలు, సీసములుగాక శశివదన, లోల, పాదప, సురలత, రుగ్మవతి, విలసితము, అంబురుహ, కుసుమవిచిత్రము అను పద్యములగూడ నందుంచి చిత్రించినది. ఈపేర్లు అప్పకవీయముననున్నను విశేషముగ తెలుగున వాడుకలోనున్నటు లగుపడదు. ఆ నక్షత్రముల వ్రాసినకాలమున ఈ కవయిత్రి "భారతీ" పత్రికలో ఆంధ్రకర్నాటకవిత్వ పరస్పరసంబంధముల విమర్శ ప్రకటింపబడగా దాని చదువుటలో నీ పద్యముల స్ఫురణకలుగుట కవకాశమైనదని తెలియవచ్చు చున్నది.

శ్రీరామశతకమును జెప్పిన వెనువెంటనే సీసపద్య ఘటితమగు శ్రీరామచంద్ర శతకమును ఈమె రచించినది.

ఈవల యొకనాడు తీరుబడి గలిగియుండి ఊబుసుపోక మనసున భక్త్యావేశముప్పొన్నమై అప్పటికప్పుడు అప్రయత్నముగ నూటపది పాదములుగల శ్రీభక్త మీరా పిలుపు అను పేర నొక ద్విపద రచన గావించినది.

ఈ కవయిత్రిగారి రచనలలో పైనచెప్పిన నాలుగుమాత్రమె యిప్పటి కచ్చుపడినవి. ఈమెరచియించిన కీర్తనలు మరికొన్ని గ్రంథములు అచ్చుపడవలసి యున్నవి, దేవి నక్షత్రమాలయను నదొకటి సిద్ధముగనున్నది. కొన్ని దండకములును గలవు. బహుశః అచిరకాలముననే నవియన్నియు అచ్చునకూర్పబడి లోకమును రంజింప జేయగలవు.

ఈ కవయిత్రి చిన్నతనమున నెద్దియో కొంత బడిచదువు చదువుకొనినదేగాని విశేషముగ పాఠశాల ప్రశస్తి గలిగినదిగాదు. అయితే ఈమెతల్లి శ్రీమతి పినపాల నాగమణ్యాంబగారు విద్యాకళలయందాసక్తి గలదియై అనవరతము తెలుగుపురాణములు దాశరథీశతకాది భక్తిప్రదములగు శతకములు అనుసంధానము చేయుచుండి, తద్ద్వారా సంపాదించుకొనిన సాహిత్య సంపదచే నొప్పినదై పలుమారు శతకముల వల్లించుచుండుటచే

భ్రమర కీటవత్తుగ నీమెకును శతకములందొక సాహిత్యము రూఢమై, ఈమెయు కొన్ని శతకముల జెప్పినది. ఈమె ప్రథమరచనయగు వీరరాఘవ శతకమున కీయమయె తొలిపలుకునసే యిట్లు తెలిపియున్నది:- "ఛందశ్శాస్త్రంబులనుగాని, పంచకావ్యములనుగాని, శృంగార ప్రబంధములనుగాని చూచియెఱుగఁగాని, చిన్ననాడు జననీజనక గురువర్యులచేఁ జదివింపఁబడిన భక్తి కరుణారస పూరితమైన శతకరాజంబులే ఈశతక నిర్మాణమునకు దోహదములు." మన శ్రీమతి బాలాత్రిపురసుందరమ్మగారు భాగ్యవశమున ఇట్టి విద్యాసంపన్నురాలగు తల్లికి కుమారితయై, ఆమెకడనె సంగీతసాహిత్యము లభ్యసించినటుల తెలుపబడియున్నది. చదువరియగు తల్లికి చదువరియగుబిడ్డ. యథామాతా తథాశిశుః.



# చిత్రప్రశ్నలు

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

కం॥ తేరరుగును కొండపయిని
సారథి భువినుండినపుడు ; జనుగాలి క్రియన్
పారదు ముందుకు మూరెడు
ధీరత గృహలక్ష్మలెల్ల దెలియుడు దీనిన్.

ఈ ప్రశ్నకు జవాబులు యీ నెలాఖరులోగా పంపవలెను.

కృ॥ సం॥

——(o)——

క్రితంనెల వాటికి జవాబులు

1. రోహిణీదేవి భరణిచేత బూని మూలకు రమ్మని హస్తముబట్టి సాధువైన చంద్రుని గవయుటకు లాగెను.
2. అప్పడం.

## సినిమా తారల జీవితాలు :



# రాగిణి



శ్రీ సూరిశెట్టి సాంబశివరావ్ బాబ్జీగారు

రాగిణిని మీరు చాలా హిందీచిత్రాల్లో చూసివుంటారు - చూస్తున్నారుగూడా- ఆమె అసలుపేరు రాగిణికాదు - షంషాద్‌బేగం. ఫిల్మురంగంలో అడుగుపెట్టగానే అది గాల్లో కలిసిపోయింది. ప్రస్తుతం ఆమె "రాగిణి"అన్న పేరుతోనే వ్యవహరిస్తూంది. కమల పుష్పానికిమల్లే వికసించే రాగిణీ సుందరవదనం ఎవరెవరి దృష్టిలోఅయితే పడ్తుంతో, వారింక జన్మంలో ఆ కమలనయనాలు గల హిమకన్యని, అనుపమ సుందరిని యెన్నటికీ మరిచిపోలేరు.

రాత్రి రాణీ పుష్పాలకి మల్లే మానవహృదయాల్ని తన సమ్మోహ నాస్త్రంతో ఆకర్షించుకునేదీ - మధుర రాగిణికి మల్లే మనోవీణతీగల్లో తీవ్రమైన కంపనాన్ని కలిగించేదీ - మధుమిశ్రిత సుఖకరవాణీ విలాసంతో ఆహ్లాదం కలిగించేదీ - అయిన యీ రాగిణీదేవి పంజాబు సౌందర్యదేవి ప్రతినిధి.

నిజానికి పంజాబుసుందరీల మూలంగానే భారతీయ చలనచిత్రరంగం యింతటి రూపధనం గలిగివుండవొచ్చు. పంజాబులోవుండే అత్యంత సుందరమోహన రమణులందర్లోనూ రాగిణి అగ్రగణ్యురాలు. ఆమె గుజరన్‌వాలా నివాసిని. ఆమెతల్లి చచ్చిపోగానే వారి కుటుంబంలో ఆర్థికంగా చాలాచిక్కులు సంభవించినై. అప్పుడు రాగిణి తనతండ్రితో కలిసి లాహోరుకొచ్చేసింది. లాహోర్లో కళాపిపాసులకింక కొదువేవుండదు. ఆమె ఓనాడు ఓకళాకారుని కంటబడగానే ఆమెని కళ్ళకద్దుకుని తీసుకున్నాడు. ఎంతో ఆదరంగా గౌరవంగా ఒహాడై రక్షరామెను తమచిత్రంలో ఓంప్రిథమంగా అడుగుపెట్టించాడు. ఆమె తొలి చిత్రం కమలా మువీటోనువారు తయారీచేసిన "దుల్లాభట్టీ". యీచిత్రం గొప్పపేరు ప్రఖ్యాతుల్నిగాంచి అఖండమైనవిజయం పొందింది. కాని ఆ గౌరవమంతా నిజానికి రాగిణీదే అనాలి.

చలాకయిన యీ పంజాబురమణి యీసరికెన్నెన్నో చిత్రాల్లో నటించింది. దుల్లాభట్టీ - హిమ్మత్ - పటావాలీ - రాపీసార్ - నిషానీ - ఫ్రాంజీ - దాసీ - ఫరీస్ హాద్ - షాజహాన్ - నేక్‌పర్‌వీన్ - బిందియా - చిత్రాల్లో ఆమె ప్రముఖపాత్రల్ని నిర్వ హించింది. సుందరి రాగిణి తనునటించే ప్రతీచిత్రంలోనూ, చూసేప్రజలంతా అపూర్వ ఆనందాల్లో ఉయ్యాలలూగేట్టు ఓ అద్భుతమైన ఆకర్షణని పుట్టించి వేస్తుంది.

రాగిణీ అంతయెక్కువగా చదువుకోలేదు. ఆమె క్కావలసిన విద్యమాత్రం అభ్య సించింది. పన్నెండు పదమూడేళ్లనుంచే ఈమెకి నాట్యమన్నా, సంగీతమన్నా మహాచెడ్డ యిష్టం. యవ్వనం ఒక్కొక్కడుగే ముందుకివేసుకుపోతూన్నకొద్దీ ఆమెలో అదోవిధమైన తేజస్సూ - విశేషమైన ఆకర్షణా - యీ రెండుగుణాలూ పూర్తిగా కలిసిమెలిసి రా సాగినై.

ఆమె ఇంతవరకూ డైరక్టరు కె. షోలీ, విష్ణుపంచోలీ, రవీంద్రదవే, హిరేన్‌బోసుల దర్శకత్వంలో నటించింది. ఆమెతోకలిసి నటించిన వారిలో మజునూ, జయంత్, నజమ్ ముఖ్యులు.

ఆమె మొన్నమొన్ననే "నేక్‌పర్వీన్"లో నాయకిగా నటించింది.

ఆమెకి సంగీతం, నాట్యం, ఆభరణాలూ, శృంగారం అంటే మిక్కుటమైనప్రేమ. ఆమె ప్రతినిత్యమూ పంజాబిడ్రస్‌నే ఉపయోగిస్తూంటుంది. నిజంచెప్పాలంటే యీదుస్తు ల్లోనే ఆమె మరింత శోభిస్తుందిగూడా. ఆమె నీలిరంగు షేర్వాణీతోనూ, పచ్చని ఉత్త రీయంతోనూ స్టూడియోలో కనిపించిందంటే స్టూడియోకే ప్రాణంలేచివచ్చిందా అన్నట్టుం టుంది. స్టూడియో ఇలాంటి అనుపమ బాలరాకతో ఉప్పొంగి పోతున్నట్టుంటుంది.

మన పూర్వకవులంతా దేవలోకపు అప్సరసల్లో చూడగలిగే ఆకర్షణ శక్తులన్నీ రాగిణీదేవిలో మూర్తీభవించి ఉన్నాయ్.

మధుబాల రాగిణీ నయనాల్లోని మాధుర్యాన్నిగ్రోలి యీనాడు యావద్భారత దేశమూ తన్మయత్వం జెందుతోంది.



# పెండ్లి చూపు లెంతవరకు సమంజసం.

శ్రీమతి కృష్ణబాయిగారు.

సాధారణంగా హిందూకుటుంబాలలో వివాహానికి మొదటిఘట్టం పెండ్లిచూపులు. ఇవి చాలా విచిత్రంగా వుంటాయి. వధూవరులేమాత్రం వయస్సుగలవారైనా, యీ పెండ్లిచూపులు లేనిదే పెండ్లిండ్లు జరుగవనుకొంటా. ఆలోచిస్తే, పెండ్లియాచారా లన్నిటితోఁబాటిదిగూడ నొక యాచారమేమో అనిపిస్తుంది.

అయితే, ప్రస్తుతకాలంలో వీనివలనఁగలుగు ప్రయోజనాలేమిటి? అసలు బాలికావివాహా లెట్లుండవలెను? అనునవిప్పుడు చర్చనీయాంశాలు.

నేటివిషయం:—

తల్లిదండ్రులుగాని, లేదా, కన్యకు బాధ్యులైనవారుగాని, యేదో తమకు నచ్చిన సంబంధాన్ని తీసుకురావడం.........వధూవరుల అంగీకారంతోనే చేస్తామనే వంకతో, పెండ్లికొడుకుని తీసుకొనివచ్చి, పెండ్లికూతుని చూపించడం, అటుపైన నా పెండ్లికొడుకుతో వచ్చిన పెద్దలెవరైతేయుంటారో, (పెద్దలేమిటి: కూడా యెవరైతేవస్తారో వారే పెద్ద) వారు, ఆ పెళ్ళికూఁతురుతో "నీవేమిచదువుకున్నావు? నీకుసంగీతంవచ్చునా? ఏదీ ఓపాటపాడు, ఓపుస్తకంచదువు" ఇత్యాది ప్రశ్నపూర్వకావకాశాలను గలుగఁజేసికొని రంగంలోకి దిగుతారు.

తరువాత, రోజుబాగుండి, కొంచెం పూర్వజన్మ పుణ్యంగలిగినవాళ్ళకు, ఆయొక్కమారుతోనే, ఆ పెండ్లిచూపులయిపోయి మూడుముళ్లు పడిపోతాయి.

పడనివాళ్ళగతి: పెద్దలు అనగా బాధ్యతగలవారలు, రోజూ రోజూ యేవో పెండ్లిసంబంధాలు తీసుకు వస్తూండడం, చూపిస్తూండడం; ఇక అక్కడనుండివారలు, నచ్చినదనీ, నచ్చలేదనీ, అవుననీ, కాదనీ, చదువు కొన్నదనీ, కట్నంలేదనీ, పెద్దదనీ, చిన్నదనీ.........

అబ్బబ్బా! వాళ్ళువేసేప్రశ్నలకు, చెప్పేకబుర్లకు, అంతమూ, అవధీయుండదు. కొందఱిమాటలలో ఎవరో అక్కర్లేదు కొంచెం ఘట్టివాఁడైతే, ఆ పెళ్ళికొడుకే అడిగేస్తాఁడీ ప్రశ్నలన్నీ. ఇక విద్యాగంధమెరిగిన సంబంధాలేమైనావస్తే? 'ఏంచదివింది అమ్మాయి' అనేవాక్యంతో మొదలుపెట్టి కొద్దోగొప్పో; విద్యావిధానాన్ని రుచిచూచి, నూతనపంథాని త్రొక్కియున్నవారలు గనుక సాహిత్యాన్ని చూడగోరతారు, సహజం. కాని, చదువులేనివారలైతే, వేసేప్రశ్నలు: 'పనిపాటలేమైనా చేతనగునా?' 'వంటబాగావండగలదా?'

వాళ్ళకు చదువంటే అసహ్యం. ఏనాలుగోఘోరమో చదివిందంటే, వాళ్ళుచెప్పేజవాబు "ఇంతచదివినదానికి మాబోటివాళ్ళుతగుతారూ! ఇల్లాంటివాళ్ళకి కాలేజీవాళ్ళేకావాలి" అనియేవో వాళ్ళకి తోచినవనేస్తారు, అంటే చదువుకొన్నవాళ్ళకుఁ బనిపాటలు చేతకావని వాళ్ళయుద్దేశంగాబోలు. ఇంతా చేస్తే, కడకు స్కూలుఫైనలు డిగ్రీయైనాలేకుండానే, వాళ్ళకంతవళ్ళుమంట.

తరువాతసంగతి: అంత చదువుకొన్నదాన్ని మేము భరించలేమనియో; లేదా, ఇంకాచదువుకొంటే మాకక్కరలేదనియో, అనేసి, అంతటితో వాళ్ళు విరమిస్తారు.

ఇక వారల యవస్థ చెప్పేదేమిటే! విద్యావంతులను గట్నాలతో మెప్పించలేరు. విద్యావిహీనులను దమకంటెం జదుకొన్నవారలంటే అసహ్యం.

ఇల్లాంటి కన్నెలకు గత్యంతరం...... సంఘమర్యాదలను వెలిచుటచే చదువుసున్న. పెండ్లికాలేదనే సెపంతో నిరుగు పొరుగువారల యాక్షేపణలు భరించలేక - ప్రపంచానికింగూడ దూరమైపోవడం ఫలితం.

## రెంటికీ చెడిన రేవని బ్రతుకు

రెండేండ్లు పెండ్లియగు టాలస్యమగుట తోడనే "ఇంతకాలం పెండ్లిగాకుండా యెందుకుండాలి?" అనేది పెద్దసమస్యగాం బరిణమిస్తుంది.

ఆనందాని కాలవాలమై, విజ్ఞానాశయాలువెల్లి విరియబోయే, పంద్రెండేళ్ళ బాల్యప్రాయంలోనే, యీ పెండ్లిండ్ల సంఘర్షణలను బాలుపడి, విద్యాలయానికి స్వస్తిచెప్పి, మఱియొక కాలక్షేప మెఱుగక కూపస్థమండుకముబోలె యుండే యిట్టి కన్యలయవస్థ యెట్లుంటుందో, అనుభవించిన వారలకే యెఱుక. అట్టివారు చదువుకొన్నచదువుగూడ మరచి పోయినారనినా, వారికున్న తెలివి నాశనమైనదనినా ఆశ్చర్యమేమిటి!

రాను రాను వున్నవారందఱికీ విసుగుపుడుతుంది. అట్లని అప్పుడైనా, వారిపెండ్లిజేయు నుద్దేశము మానుకొనరే; ఏదో వక సంబంధం ముడిపెట్టెయ్యాలనే తలుస్తారుగాని.

చివర కేరెండోపెండ్లి వానికో......ఎవనికో కట్టిపెట్టడంతో వారిబాధ్యత తీరిపోయినట్లుగా సంతసింతురు. ఎంతతెలివైన వారల తెలివీ చివరకీలా మట్టిపాలవుతుంది. ఇంక స్త్రీ జనాని కభ్యుదయం రావాలంటే యెల్లావస్తుందీ?

## అయితే దీనికిపుడు కర్తవ్యమేమి?—

సకాలంలో బాలికాపంథాల కడ్డుపడే యీపెండ్లిచూపులనే దురాచారం పోవాలి. బాలికా విద్యావిధానం సక్రమంగా నడవాలి. మధ్యలో వారల కేవిధమైన ఛిద్రాలులేకుండా చదువు చెప్పించాలంటే, స్త్రీ సంఘాభివృద్ధి పెంపొందాలంటే, ముఖ్యంగా నీ పెండ్లివిషయాలు వారికే వదలాలి.

హృదయ కుసుమము సువాసన లీనుచు విడువ నారంభించు రోజులలోనే, వారిని కూపస్థ మండూకములుగా నొనర్పక, వారి విజ్ఞానాశయాలు వృద్ధిపొందించాలి.

సీత, సావిత్రి, దమయంతి, ద్రౌపది మున్నగు పురాణకాలంనాటి స్త్రీలు గూడ నంతటి వారలెట్లు కాగల్గిరి? వారిలో చదువులేని వారెవరు? ఒక్కవిద్య తక్కువైనదనేగా అశ్వపతి తన కూంతును మహర్షి యింటికైనఃబంపి నేర్పించినాఁడు!

అదీగాక, పది పన్నెండు సంవత్సరాలు వచ్చేటప్పటికే పెండ్లిండ్లు తప్పక చేయాలనే శాస్త్ర మెచ్చటనులేదు. వేదకాలంనాటి మునికన్యలుగూడ, తమవిద్య పూర్తియగువరకు వివాహమాడువారలు కారు. అప్పుడుకూడ వివాహము వారియిచ్ఛతోఁ గూడుకొనినదే. గార్గి, మైత్రేయి మున్నగు ఋషికన్యకలే దీనికిఁ దార్కాణం.

తరువాత నాడపిల్లల విద్యా విధానంలోఁగూడ చాలమార్పులు గావాలి. ఏ హైస్కూలులోనైనాసరే; ఆడపిల్లలకు జీతాలుండగూడదు. ఆవిధంగా యున్నప్పుడే నారీలోకం పైకివస్తుంది.

ఈ జీతాలు భరించలేక నాడు బిడ్డలను జదువు మానిపించేసే డెంతమందీ?

బాలురైతే యెవరిదగ్గరికైనా వెళ్ళి, కష్టపడియైనా విద్య నభ్యసించెదరు. కాని వీధిగుమ్మం కదిలితేనే తప్పుగాయెంచే బాలికలగతి! దీని నాలోచించే మహాత్ములెవరు? ఎక్కడేనా యొకటి రెండు ఉంటేమాత్రం అవి యెంతవరకు నుపయోగించగలవు? ఎన్నియూళ్ళవార లచ్చటికేగి చదువుకొంటారు?

ఇవన్నీ ఆలోచిస్తే మన దేశంలో స్త్రీ విద్యా విధానమే అధ్వాన్నంగాఁ గనుపిస్తుంది.

శారదా చట్ట మమలులోనికివచ్చి చాలాకాలమైనది. స్త్రీ లోకానికి కొన్ని హక్కులుకూడా ఏర్పడ్డాయి; కాని భావి భాగ్యోదయంబైన, బాలికా విద్యా విధానంలో మార్పేమీ కనబడుటలేదు. సమర్థులైన సతీమతల్లులు దీనినిఁగూడా ఆలోచించి పుణ్యం కట్టుకొంటారనుకుంటా.



---

# గమనించండి.

మేము ప్రచురింపజాలని రచనలు రచయితలకు తిరిగి పంపబడవు. కాబట్టి వృథాగా పోస్టుబిళ్లలు పంపకండి. నకళ్లు వ్రాసి ఉంచుకుని అసలు రచనలంపితే ఉభయత్రా సౌకర్యం.

సంపాదకుడు.

---



# నవోదయం - అభ్యుదయం

నవోదయం
నవయుగోదయం
అభ్యుదయం
శుభోదయం.



మాలోమాలో
నవోదయం
అందరిలో
అభ్యుదయం.

నవభారత
నారీమణి
నాగరికతా
శిఖామణి

హరిజనదే
వాలయప్రవేశం
విడాకులబిల్లు
ప్రవేశం.



నవోదయం
శుభోదయం
మహోదయం.

  

ఇంటింట 'గృహలక్ష్మి' వెలిసింది నేడు ;

ప్రతి గృహిణి చదివింది ప్రతియింట నేడు ;

'గృహలక్ష్మి' పాటలను గృహిణు లందరు పాడ

'గృహలక్ష్మి' సేవెంతొ చేసింది చూడు !

మంగళపల్లి సుబ్రహ్మణ్యం



# శారద లేఖలు



సౌభాగ్యవతి కల్పలతకు



నెచ్చెలీ!

చేనేత వస్త్రములకు మజూరీ నిర్ణయించుటచే రేపో మాపో చేనేత పారిశ్రామికుల సమ్మె జరుగనున్నదనియు, నదియే జరిగిన నిప్పటికే వస్త్రకాటకముచే కటకటలాడుచున్న మనరాజధాని ప్రజలదుస్థితి మరింత దుర్భరమై పోవుననియు ఇంతవఱకు యేచింకిపాతలనో కట్టుకొనుచున్న మనము, చెట్ల ఆకులనో పట్టలనో కట్టుకొనవలసి వచ్చుననియు ఆందోళన పడుచు నీవువ్రాసిన లేఖచూచితిని. రానున్నదానికి భయపడుచుంటివి గాని యిప్పుడు మాత్రము మనమనుభవించుచున్న గుడ్డకఱవు సామాన్యమైనదా? మనిషి 1 కి ఆయిదు గజముల మిల్లుగుడ్డ కోటా ప్రజల అక్కఱను తీర్పజాలక పోయె. ఇంతవస్త్రకాటక మనుభవించుచున్నను ఖాదీయుత్పత్తి యెడల ప్రజలు శ్రద్ధాళువులు కాలేరి. ఈపరిస్థితిలో గుడ్డలకఱవు దుస్సహము కాక యెట్లుండ గలదు?

నేటిమాట యేమి? యుద్ధారంభము నుండియు గుడ్డల కఱవిట్లనుభవించుచునే యున్నాము. అన్న వస్త్రములు రెండు సమాన ప్రాముఖ్యము గలవి.

ప్రాణావసర వస్తువులలో వీనిని మించినవి లేవు. అన్నముకంటె గుడ్డముందుగా మానవులకు కావలెను. ఒక్కఇల్లాలు గర్భవతి కాగానే ఆమెకు పుట్టబోవు బిడ్డకొఱకు పాతగుడ్డలన్నియు మూట గట్టి భద్రముచేయుట మనమెఱుగుదుము. బిడ్డ భూపతనము కాగానే మంత్రసాని పొత్తిగుడ్డలకొఱకు కేకలు పెట్టును. అదియే మానవులు ఆమరణ పర్యంతము వస్త్రచ్ఛన్నులై యుండవలసినదే. ఆరునెలలు దాటినగాని అన్నప్రాశన జరుగదుగాని వస్త్రము మాత్రము పుట్టుకైన తరువాత ఒకనిముషమైన ఆలస్యములేదు.

వస్త్రధారణ మీదనే మానవుల మంచిచెడ్డలు పరువు, మర్యాదలు, డాబు, దర్పములు ఆధారపడి యున్నవి. ఇంటగ్రాగిన గంజికడుగుల నెవ్వరు చూడరుకాని, మనుష్యుడు ధరించిన వస్త్రములు మాత్ర మెల్లరి సాక్షించి వారినిగుఱించిన వివిధాభిప్రాయములకు ఆస్పదమగును. ఇతడు గొప్పవాడు, ఇతడు పేద, ఇతడు పెద్దమనిషి, ఇతడు షోకేలా, ఇతడు లోభి, ఆతడు దేశభక్తుడు, ఇతడు విజాతీయ వ్యామోహము కలవాడు అని మానవులు ధరించు వస్త్రములను బట్టే మనము నిర్ణయించుచున్నాము.

ఇట్టి అత్యంత ప్రాముఖ్యమైన వస్త్రముల విషయమై మనమిటీవల పడుచున్న పాట్లు హృదయ విదారకమైనవి. గుడ్డకఱవుచే శవములకు కప్పబడిన గుడ్డలు గూడ అపహరింప బడుచున్నవనియు, జెండా

గుడ్డలను గూడ దొంగిలించినారనియు, వస్త్రహీనతచే కొందఱుమానవతులు ఆత్మహత్యనే చేసికొనినార నియు మనము పత్రికలలో జదివి యుంటిమిగదా! అయితే అత్యంతావసరమైన ఈగుడ్డల విషయములో చేనేత పారిశ్రామికులును, మిల్లుయజమానులును, వస్త్రవిక్రేతలును అవలంబించిన విధాన మత్యంత గర్హమైన దనుటకు సందియములేదు.

వీలైనంత సరసమైన ధరలలో ప్రజలకు వస్త్రముల నందజేయ వలయునను తలంపుతో దీనికొక ప్రత్యేక డిపార్టుమెంటు నేర్పరచి దొరతనమువారు మొదటినుండియు ఈవిషయమై యెంతయో కృషి చేయుచున్నారు, కాని స్వార్థపరుల దుశ్చర్యల ముందు వీరికృషి విఫలమే ఆయినదని చెప్పవచ్చును.

నూలుకు, గుడ్డకు, గూడ ధరలు నిర్ణయించియు, కోటాలు నిర్ణయించియు, పంపక విధానమవ లంబించియు గవర్నమెంటు వారెన్నియో తిప్పలు పడిరి. కాని చీకటిబేరముల నరికట్టు రాజశాసనము లెన్నియైనను నైతికశాసనముతో సరిరావు. మానవులు నీతినిష్ఠకు నిలబడి యుండలేని వారిని రాజశాసన ములచే సన్మార్గమున ప్రవర్తింప చేయుట కల్ల. స్వార్థప్రేరితులైన మానవులు ఋజుమార్గమున వర్తించుటయు కల్లయే, రాతిక్రింద కప్పకు రాతిక్రిందనే ఆహారముగదా!

ఈపట్టున చేనేత పరిశ్రమకు నిలయములైన మంప్రాంతముల వృత్తాంతములు వినినచో ఈవిషయ మున ఎంతదుర్వ్యాపారము సాగినదనియు, సాగుచున్నదియు తెలియగలదు. మాయూరికి ఆరుమైళ్ల దూర ములోనున్న ఒకగ్రామములో అధిక సంఖ్యాకులు చేనేత పనివారు. ఆయూరిలో నూలు కోటాలు పుట్టక పూర్వమున్న మగ్గములుమూడువందలట. ప్రస్తుత సంఖ్యవేయికి పైబడినవట. మనపరిశ్రమల శాఖామంత్రిగారు యిటీవలనే దొంగమగ్గముల విషయము మాటి మాటికి వెల్లడించుచున్నారు, గాని ఈవిషయము మేము మునుపే వింటిమి. నెలలో పదిదినములకు సరిపడిన మానూలును యిచ్చుటచే గల్గిన యిబ్బందిని యిట్టి అధిక సంఖ్యాబలముచే సర్దుకొనినారట, పోనిమ్ము వారియిబ్బంది ఈవిధముగానైన తీర్చుకొనినారు మంచిదే. ఈమధ్య రేపనింగు గల బస్తీలలో జనసంఖ్య చాలా హెచ్చినదని చెప్పుచున్నారు. అబ్బో! ఇంతకొద్దికాల ములో ఈపట్టణపు జనసంఖ్య యింత హెచ్చుగా ఎట్లుపెరిగినదనగా, పైపాతిక వేలు రేపనింగు సంతతి లెండని చెప్పినారొకరు చమత్కారముగా. అటులనే నూలుకోటా కొఱకు నామమాత్రం మగ్గములు వెలసినవి కాబోలు. ఈవిధముగా నూలువసూలు చేయుచున్నవారు అంతటితో సంతృప్తి పడినబాగుగానే యుండును, కాని మాకునెలలో పదిరోజులకుసరిపడిన నూలునే యిచ్చినచో తక్కినయిరువది రోజులు మేము బ్రతుకు టెట్లని ఆందోళన చేసి నేతమజూరీలను పుష్కలముగాపెంచిరి. అంతటితో ఆగి తమకిచ్చిన నూలును తామే స్వయముగా నేసి విక్రయించినను నేతగుడ్డలకింత ధరలేచియుండదు. నూలును తీసుకొనినవారు వస్త్రమును నేసి యేసహకార సంఘములకో సప్లైచేయ వలసిన జవాబుదారీ లేనందున యిచ్చుటగూడ కృత్రిమ తంత్ర ములు బయలుదేరినవి. తమకు వచ్చిన నూలుకోటాను తాము వస్త్రముగా నేయక అధిక లాభమునకు షాహుకార్లకు విక్రయించుటయు వారు ఆనూలును హెచ్చుమజూరీలకు నేయించి తమచిత్తము వచ్చినధరలకు విక్రయించుటయు జరుగుచున్నది. నూలు నేతనేయువారికితప్ప అన్యులకు విక్రయింప బడని యీరోజులలో షాహుకార్లు కంపెనీలుగాయేర్పడి గుడ్డలు నేయించు చున్నారనిన వీరికి నూలెక్కడిది? చేనేత

పారిశ్రామికులందు యీగ్రామాదులలో సాహుకార్ల పెట్టుబడి పైగుడ్డలు నేయించి విక్రయించు అంగడులు చాల వెలసినవి. పేదపారిశ్రామికులు ధనాశాపరులై సాహుకార్లకు నూలుకోటాలు విక్రయించుటే లేకపోయినచో నేతపనివారెంతమజూరీలు వేసికొనినను నేతగుడ్డలధర లింతఅధికమయ్యేడివి కావని మా యూరులలో పరిపాటిగా చెప్పుకొనుచున్నారు. పారిశ్రామికులు సాహుకార్లును ఏకమై ప్రజల నీవిధముగ బాధపెట్టుచు మాట మాట్లాడిన సమ్మెలు కట్టెదమని బెదరించుట మగనిని కొట్టి మొఱబెట్టినట్లున్నది. ఏమైన తాము సరసమైన ధరకు పారిశ్రామికులకు నూలుసప్లైచేసినప్పుడు ఆనూలును అతను స్వయముగా నేయు చున్నాడా లేదా? నేసినచో దానినేధరకు విక్రయించు చున్నాడను దొరతనపు పరిశీలన లేకపోవుట గొప్ప లోపము. ఈపరిశీలనయే యున్నచో నడుమ పెట్టుబడిదార్ల దోపిడిలేక నేతగుడ్డలు సరసమైనధరలకు ప్రజలకు అందుబాటయ్యేడివి. దొరతనమువారు టెక్స్టైల్ డిపార్టుమెంటును పెట్టిన యుద్దేశము సార్థకమయ్యేడిది కాని ఈవిషయమున గవర్నమెంటువారేలనో ఉపేక్షించిరి. కాన యిది దొరతనమెఱిగిన దొంగతనమైనది.

చేనేతపారిశ్రామికులేమి సాహుకార్లేమి దేశమంతటను సంఘములు పెట్టి తమహక్కులకొఱకును తమసౌకర్యములకొఱకును నిరంతరాందోళనచేయుచున్నారు. ప్రజానాయకులు వీరికిసహాయముచేయుచున్నారు. పత్రికలు వీరిని బలపఱచు చున్నవి. ఈనాడు ప్రభుత్వమువారీవిషయములో ఈపారిశ్రామికుల మాట పెడ చెవిని బెట్టినచో ముప్పైలక్షలమంది చేనేతపారిశ్రామికులు కష్టములపాలవుదురని వ్రాయగనే నిజమని ప్రభుత్వమువారును నమ్మవలసి వచ్చుచున్నది. వారిఅభీష్టములతీర్చవలసి వచ్చుచున్నది. కాని ఈపారిశ్రామికులయొక్కయు, సాహుకార్లయొక్కయు స్వార్థప్రవర్తనవలన మనరాజధానిలో అయిదువందల లక్షలప్రజలు ఎంతకష్టపడుచున్నారో ఆలోచించువారులేరు. పరిశ్రమల సంఘములకు, సాహుకార్లసంఘములకుగూడ మన నాయకులు కొందఱు సహాయముచేయుచు సలహానిచ్చుచు ప్రోద్బలపఱచుచుందురు. పారిశ్రామికులలో చైతన్యం గలిగించి సమ్మెకట్టుల లేవదీయించుటలో వీరుతోడ్పడుచుందురు. ఈసందర్భమున జరిగెడి సభలలో ఏకోటివద్ద ఆపదము పాడుటయేగాని స్వధర్మనిర్వహణలో న్యాయైకదృష్టులు కండని ఉద్బోధించువారు కానరారు. అన్నిటిలోనున్నట్లే నాయకత్వమును బ్లాకుమార్కెట్టులు బలియుటచేతనే పలుకుబడిని ఆశించి సత్యమునునొక్కిచెప్పి వర్గములవారి అభిమానమును కోల్పోవుటకు వెరచు చున్నారు.

కల్పలతా! ఈగుడ్డల కఱవువలన మన స్త్రీలుపడిన కష్టములిన్నియన్నిగావు. ముఖ్యముగా వితంతు స్త్రీలు పడుచున్న వస్త్రహైన్యతనుచూచిన హృదయము విదారించును. పూర్వమేమి ధరించువారో తెలియదు గాని తెల్లవారువచ్చి మల్లులుపెట్టి, మల్లుతానులు తయారుచేసి మనదేశమునకు దిగుమతి చేయుటకారంభించిన దాది వారికదియే కట్టుబట్ట. పూర్వము రెండుపంచలు, మూడునాల్గురూకలకన్న యెక్కువకాకుండుటచే వారవి కొనుక్కొనుటకంత భారముగానుండెడివికావు. కానియుద్ధమువచ్చినది మొదలాతానులు వచ్చుటబందయ్యెను. దేశములోమిల్లులు తయారుచేయుమల్లులు కోటాలప్రకారము అందజేయబడగా కట్టుపంచకు కావలసిన గుడ్డ ఒక్కమారుగా లభించుట దుస్తరమయ్యెను. అవియు సిఫారసుగలవారికేగాని పేదసాదులగోడుచూచు వారులేరైరి. కలిగినమ్మ కలిగినమ్మకేపెట్టును; లేనమ్మ కలిగినమ్మకే పెట్టుననిసామెతగదా! సాహుకార్లుతమ కిచ్చినకోటాలను ధనవంతులైన తమఖాతాదార్లకే యిచ్చిరిగాని పేదవారిని కనికరించరైరి. ఈగోడుచూచి

మేము మాసంఘముపక్షమున గతవత్సరము టెక్స్టైల్ ఆఫీసర్ గారిని అర్థించి నూటయాభైమంది స్త్రీలకు కట్టుపంచలను తెప్పించియిచ్చితిమి. ఇందులకు షాహుకార్లుచేసిన అలజడి నేమిచెప్పుదును? ధనికస్వాములకు ప్రజానీకముపై సానుభూతిలేనప్పుడు యెన్నిఆగడములైన జరుగును. అయినదేమో అయినది. కొద్దిరోజులలో గుడ్డలపై కంట్రోలు రద్దుచేయబడునని నిన్న నేటిపత్రికలలో చదువుచున్నాము. దీనగుడ్డలధరలు సరసముగు రేట్లకు వచ్చి ప్రజలయిక్కట్లునివారణేయమగునో, కంట్రోలు తొలగించిన తరువాత అర్థణా నిప్పుపెట్టె అణాకును మూడురూపాయల సాలగాలకమ్మెడి వోవల్టీనుడబ్బా ఆరురూపాయలన్నరకును, పదిఅణాలకొబ్బరినూనె రూపాయ బేడకును బజారున బాహాటముగా అమ్మబడుచున్నట్లుగా నీగుడ్డలుగూడ యిబ్బడిధరలకుపెరిగి యింకనుప్రజలను కృంగదీయునో మునుముందు చూడవలెను.

ఇట్లు మిత్రురాలు,

శారద.

# దాంపత్యము

చె. శ్రీ. వెంకటరామయ్యగారు, పూనా.

అర్థంబు వాక్కులో నణగియున్నటుల
లయను వీడనియట్టి లాస్యంబువోలె,
తలిరులలోనుండు తావి చందాన
జతనువీడని పక్షిజాతుల పగిది
ఒందుగా దంపతు లొప్పుచుండవలె.
వాక్కునదాల్చెను వనితనొకసామి,
ఉరముపై నిల్పెను యువిదనొకసామి,
సగముదేహంబిచ్చె సతికొక్కసామి,
భర్తయు నటువలె భార్య నేలవలె.

పతిప్రాణములు ప్రేతపతిగొనిపోవ
వెంటాడి తెచ్చెను వెలదియొక్కర్తె,
నట్టడవిలో తన్ను నాథుండువిడువ
రప్పించి చేపట్టె రమణి యొక్కర్తె,
బలిమిని చెరపెట్ట భర్తృవిరోధి
మౌనంబు విడలేదు మగువయొక్కర్తె,
మునిశాపమున పతికి ముప్పువాటిల్ల
సూర్యుని గతినిల్పె సుదతియొక్కర్తె,
ఇటువలె దాంపత్య మింపులుగులుక
ఆదర్శప్రాయమై యలరారవలయు.

["నైవేద్యం" నుండి]

 

# సుదినం



శ్రీమతి పొన్నపల్లి అన్నపూర్ణాదేవిగారు

నాస్నేహితురాలు సరస్వతమ్మగారి కుమార్తె పెండ్లి పిలుపు మాకుకూడా వచ్చినది. శుభలేఖలో 5 రోజుల పెండ్లి అనీ, పాటకచేరీలు, హరికధలుతోపాటు ఒకరోజున సుశీలాదేవిగారు, 'దాంపత్యానుకూలము' అను విషయమును గురించి ఉపన్యసింతురు అనివ్రాసి యున్నది.

ఆరోజు సాయంత్రము నేను, యింటిపనులన్నియు త్వరలోముగించుకొని పెండ్లి వారి యింటికి వెళ్లినాను. వధూవరులకు యెదురుగా సుశీలాదేవిగారు ఈక్రింది విధంగా ఉపన్యసించినారు.

దాంపత్యానుకూలమే గృహానందసౌఖ్యము. యిటువంటి ఆనందమయమైన గృహాలు కొన్నికలిస్తేనే సంఘము ఏర్పడుతుంది. అన్నిటికంటె ముఖ్యముగా ఐకమత్యము అనేది ఉంటేనేతప్ప కుటుంబాలలో ప్రశాంతి ఏర్పడదు. గృహములో భర్త కంటెను, భార్యకే బాధ్యత యెక్కువై యున్నది. సాధారణంగా స్త్రీతలచుకొంటే యెటువంటి సాగరాన్ని అయినా దాటించగలదు. కాబట్టి యిటువంటి స్త్రీస్వరూపిణికి చిన్ననాటినుండి క్రమమైన శిక్షణ, విద్య అవసరమైయున్నది. ఏదీ? అటువంటి విద్యావిధానమే మనదేశములో కరువైనది.

విజ్ఞానవతియైన స్త్రీ అత్తవారి యింటికి వెళ్లిన పిదప, తనగృహిణీధర్మాన్ని గుర్తెరింగి యింటిపనులన్నియు చక్కబెట్టుకొనుచూ, అత్తమామలకు సేవజేయుచూ, కుటుంబములోని వారందరితో అనుకూలముగావుంటూ, నిష్కల్మషమైన హృదయముతో తనధర్మాన్ని తను కాపాడుకొంటూ, పెద్దవారల అభిప్రాయాన్నిబట్టి తనకు చేతనయినంతవరకు దేశాభ్యుదయానికి పాటుపడుట ముఖ్యమై యున్నది.

విజ్ఞానమంటే యిప్పటిచదువులు మాదిరిగా కాలేజీలలో చదివి పేరునకు మాత్రమే డిగ్రీలుపొంది, మానవధర్మాన్నే గుర్తెరుగక తమకంటెను విజ్ఞానవంతులైన స్త్రీలను హేయముగా జూచుచు, పాశ్చాత్య వేషభాషలకు అలవాటుపడి సామాన్య స్త్రీలతో కలసిమెలిసియుండక, వారి కాలేజీచదువులే గొప్పవను దురభిప్రాయముతో

ఆ చదువులేని వారలను నిరసించుట అలవాటయింది. విద్యకు ముఖ్యమైన విషయము మినహా అన్నియు వారియందు వుంటవి.

అత్తవారియింటికి వెళ్లిన పిదప గృహకృత్యములందు యేవిధమైన ప్రవేశము లేక పోవుట యట్లుండ, ఆఖరుకు తమగర్భమున పుట్టిన బిడ్డలకు పాలుయిచ్చిన తమ అంగ సౌష్టమునకు లోపము వచ్చునను తలంపుతో, దాదులచే పిల్లలను పెంచుచూ, పాలు యిప్పించుచు వారిని అనాగతి పాలుచేసి తమకు పిల్లలకు యేవిధమైన సంబంధము లేక యెవరికి వారే యగుచున్నారు.

కాబట్టి గృహిణికి కావలసిన ధర్మాలు, సాహిత్యము, చిత్రలేఖనము, కుట్టుపనులు, మొదలైన విద్యావిధానమే స్త్రీకి కావలసిన విద్యయనవచ్చును. అనగా భాషాజ్ఞానము కొరకు భాషచదివిన తప్పులేదు. యింగ్లీషు చదువకూడదనిగాదు.

యికముందైనను మన కాంగ్రెసు నాయకులందరూ కస్తూరిబా స్మారకనిధిని పై జెప్పిన విధానము ప్రకారము కొన్ని కేంద్రములు స్థాపించవలసినదిగా మన స్త్రీలందరూ కలసి ఒకవిన్నపం పంపుదాము, అంటూతన ఉపన్యాసమును ముగించినది.

తరువాత స్త్రీలందరూలేచి, వధూవరులను, ఒండొరులు ప్రేమమయులై దేశసేవ కొఱకు మీ జీవిత సమర్పణముజేసి, ఆదర్శదంపతు లనిపించుకొని ధన్యజీవులుకండని ఆశీర్వదించిరి.

యిటువంటి శుభకార్యములలో గూడా ఎన్నోవేలు అనవసరమైన వినోదములకు ఖర్చుపెట్టేకంటే; నూతన వధూవరులు అయినవారికి ఆదిలోనే దాంపత్యం అంటే ఏమిటో చక్కని మాటలతో హితబోధచేసిన వారయినారు. 'ఆహా! నేడు యెంత సుదినం' అను కొంటూ యింటికి వచ్చేశాను.






మద్రాసు రాష్ట్రంలో ఆసుపత్రులందు నర్సులుగా పనిచేయుచూ తర్ఫీదునందే ముసల్మాన్ స్త్రీలకు ఒక్కొక్కరికి నెలకు రు 25 లకు తక్కువగాకుండా, స్కాలర్‌షిప్పు లిచ్చుటకు దక్షిణ భారతముస్లిం విద్యా సమితివారు నిర్ణయించినారట.

♦ ♦ ♦

తమిళనాడు కస్తూరిబా గ్రామసేవికా శిక్షణ శిబిరంలో ఇప్పటికి మొదటి జట్టుగా 30 మంది యువతులు తయారవుతున్నారు. వీరి తర్ఫీదు పూర్తికాగానే రెండవజట్టుగా 40 మంది తయారుచేయుబడుదురట.

♦ ♦ ♦

అమెరికాలో ఒక పట్నమందు ఒక పెద్దమనిషి పబ్లిక్ పార్కులో అక్కడఉండే బల్లలు,కుర్చీలుపెట్టి చిన్నకుటీరం నిర్మించాడు. అందుకతని అరెస్టుచేసి, మ్యాజస్ట్రేట్ ఎదుట నిలవబెట్టినారు. అతడు నేరం వప్పుకుంటూ — "నాభార్య నాతో తగవులాడినప్పుడు తలదాచుకోను ఒకతావు కావలసి ఆపని చేశాను." అన్నాడు.

♦ ♦ ♦

ఆస్ట్రేలియాలో క్రమతః జనాభా తగ్గిపోవుచుండుటచే-55 సం॥ లలో చెప్పుకోడానికి ఆస్ట్రేలియన్ (యూరపియన్) ఉండడట. పుటకలు తక్కువగా ఉండడమే కారణమట.

♦ ♦ ♦

యుద్ధకాలంలో బ్రిటన్‌లో అంగరాగముల (Cosmetics) ఉత్పత్తినిలిపి, మందుగుండు సామాను హెచ్చుగా తయారుచేశేవారు. అందుచేత బ్రిటిష్‌యువతులు వానిని చాలాతక్కువగా ఉపయోగించేవారు. యుద్ధంముగిసి, నిర్బంధాలుతొలిగి ఉత్పత్తివిస్తారమయ్యేసరికి, పడుచులు, ముసలివారుసహా స్త్రీలందరు వానిని విశేషంగా ఉపయోగిస్తున్నారట. ఈసాలున వారు 1,60,00,000 పౌన్లు-ఖరీదుగల అంగరాగము లుపయోగించారు. యుద్ధాత్పూర్వంకన్న 2½-రెట్లుహెచ్చు.

♦ ♦ ♦

లెక్సింగ్టన్‌లో ఒక ఇల్లాలు తనభర్తతన్ను "గండ్రగొడ్డలి" అని పిలిచినందుకు విడాకులు కోరినది. అందుకు జడ్జీ "పెండ్లి అయినవాళ్లందరికి తెలుసు, భర్త భార్యనట్లా ముద్దుకుపిలుస్తాడు," అని— అంటూ ఆమెను మందలించాడట.

♦ ♦ ♦

ఆస్ట్రేలియాలో ఉత్తమరచనలకు 3 బహుమానాలు ప్రకటింపగా వానిలో రెంటిని స్త్రీలే సంపాదించినారు. వారిద్దరు ఇల్లాండ్రు; ఇద్దరేసిబిడ్డలతల్లులు.

♦ ♦ ♦

తిరువూరునందలి జీవాబాయిదేవిజీ బాలికోన్నత పాఠశాలకు ఆపర్ అనే ఆయన కీ. శే. తనఅల్లుని జ్ఞాపకార్థము ఒకరేడియోసెట్టున్నూ, భవన నిర్మాణమునకు రు. 25,000 లు రొక్కమున్నూ ఇచ్చినారు. ఆ రేడియోసెట్టునకు శ్రీ మద్రాసు గవర్నరుసతి ప్రారంభోత్సవము సలిపినది.

♦ ♦ ♦

యుద్ధానికి పూర్వం బ్రిటిష్ లో 50,00,000 మంది స్త్రీలు పొగత్రాగేవారట.

♦ ♦ ♦

లండన్ లో రాజభవనమైన బక్కింగ్ హామ్ సౌధమునంటి ఉద్యానవనమొకటున్నది. ఆవనములో ఇతరులు ప్రవేశింపరాదు. అయితే ఈ జూన్ 26 వ తేది ఉషఃకాలమందు ఒకలతానికుంజములో ఇద్దరు అమెరికన్ యువకులు, 23 సం॥ లవారు నిద్రిస్తుండగా వనపాలకుడు కనుక్కొన్నాడట. వారిని ప్రశ్నించగా వారన్నదిది: "ఆప్రక్కనపార్కులో గలభాచేత మాకు నిద్రపట్టలేదు. బాంబుచేతకూలిన మొండిగోడఎక్కి ఈతోటలోకిదూకి ప్రవేశించి, ఇక్కడహాయిగా నిద్రపోతున్నాము."

♦ ♦ ♦

శ్రీమతి అనిబిసెంటుగారి శతవార్షికోత్సవము ఈసం॥అక్టోబర్ 1వ తేదినజరుగును. ఆరోజున ఆమెకర్హరీతిని స్మారకచిహ్నము నెలకొల్ప ప్రయత్నములు జరుగుచున్నవి: కొద్దిరోజులు క్రిందట ఆమె పేరట నొకవిద్యార్థి వసతిగృహమునకు శ్రీసర్ యస్. రాధాకృష్ణన్ గారు శంఖుస్థాపనమొనర్చిరి.

---

## కీ॥ శే॥ విశ్వనాథకవిరాజు; వర్ఘు బాబూరావుగారు

వీ రుభయులను ఆంధ్రమాత గతమాసంలో గోల్పోయింది. ఇద్దరు కళానిపుణులు. ఒకరు కవులు, మరొకరు చిత్రలేఖకులు. కవిరాజుగారు 54 సం॥ లకే 86 నాటకాలువ్రాశారు. నాట్యకళాపరిషత్తు నేర్పరచడానికి విశేషంగా కృషిచేశారు. శ్రీ బాబూరావుగారు ఢిల్లీలో రాజభవనంలో గోడలమీద చిత్రములువ్రాశారు. అందులో ముఖ్యంగా తెలుగుదేశంలో మహానుభావులు బొమ్మలు: తెలుగు రెండెడ్లబండి, తెలుగురైతు తూర్పారపట్టడం, తెలుగు పడుచు ధాన్యపురాశిచేయడం, చిత్రించి తెలుగుజీవితం, తనపేరు కూడా అక్కడఢిల్లీలో శాశ్వతంచేసుకున్నారు. వీరిఆత్మలకు శాంతికల్గుగాక.

# వైజ్ఞానిక విశేషాలు

పరమాణుశక్తి వ్యాపకమునకు విరుగుడుగా, ఈదారంగు ప్రసారమును ఇద్దరు చికాగో శాస్త్రజ్ఞులు కనిపెట్టినారట. పరమాణుశక్తి వ్యాపకమువల్ల రక్తము పలుచబారునట; ఈరంగు ప్రసారమున రక్తము గడ్డ కట్టించి దాని దుష్ఫలితమును అరికట్ట వచ్చునట.

♦ ♦ ♦ ♦

భయమువల్ల ఆత్రమువల్లవచ్చే జబ్బులు - అన్ని జబ్బులకన్నా భయంకరము లైనవట. హఠాత్తుగా పెద్ద శబ్దము విన్నప్పుడు నీవు అదరిపడుతావే - అప్పుడు నీదేహంలో జరిగే విశేషములు తెలుసుకొంటే నీకే ఆశ్చర్యంవేస్తుంది. శబ్దం వినగానే ముందు నాడి తీవ్రమవుతుంది. చర్మముపైనున్న రంధ్రములు కొంచము తెరచుకొని - మామూలుకన్నా హెచ్చుగా లోని తేమను బయటికి కక్కుతాయి. చర్మమునంటి అడుగున ఉండే రక్తనాళములలోనికి హెచ్చుగా రక్తము ప్రవహిస్తుంది. దేహమంతటా కండరములు బిగువు ఎక్కుతవి. ఉచ్ఛ్వాస నిశ్వాసముల రేటుకూడా హెచ్చుతుంది. నీ కడుపులో పేగుల సంచలనము మారుతుంది; అవి ద్రవించే రసముల పరిమాణమున్నూ మారుతుంది. రక్తపుపోటు భేదిస్తుంది. ఈమార్పులవల్ల మూత్రకోశం లోనుంచి కొన్నిపదార్థములు రక్తములోకి స్రవిస్తవి.

♦ ♦ ♦ ♦

మన ఇండ్లలో పలువిధములైన లోహపుపాత్రలు వాడుతున్నాము. వానివాని గుణగతములగూర్చి శ్రీ కే. వి. సుందరమయ్యర్ యం. యస్.సి , యఫ్. ఆర్. ఏ. సి. మద్రాసు ప్రభుత్వంలో అనలిస్టు - ఇట్లని వివరించారు; అల్యూమినిం పాత్రలలో వండితే విశేషం ప్రమాదమేమీలేదు. అయినా అవివండిన పదార్థములుంచను, వాటిపై మూతపెట్టను బాగా పనికివస్తవి: పాలుకాచి నిలువ వుంచినా చెడిపోవు. రాగి పాత్రలో కాచినపాలలో విటమినులు నశించును. ఏనోమ్లేకులు మున్నగువాని శకలముల లోహముకలిసిన పాత్రలు - హానికరములు. అన్నిటికన్నా ఉత్తమమైన పాత్రలు - మట్టికుండలు.

♦ ♦ ♦ ♦

గర్భవతులుగా ఉన్నప్పుడు తల్లులు సరియైన ఆహారం పుచ్చుకొంటే నెలలునిండనిదే ప్రసవములుగాని, శిశుమరణములుగాని హెచ్చుగావుండవు అని ఫిలడెల్ఫియాలో పెన్సిల్వేనియా ఆసుపత్రియందు డా. టాంప్‌కిన్స్ పరిశోధించి చెప్పుచున్నారు. 2000 మంది గర్భవతుల నొకచోటచేర్చి వారి ఆహారమును తానుగా నిర్ణయించి నడిపినాడు. మరొక 2000 మంది నొకచో చేర్చి వారి ఇష్టమువచ్చిన ఆహారం తిననిచ్చినాడు. తన నిర్ణయం ప్రకారం ఆహారం పుచ్చుకొన్నవారిలో 6 గురు మాత్రమే నెలలు నిండకముందుగా ప్రసవించి నారు. 8 మంది శిశువులే మరణించినారు. విచ్చలవిడిగా భోంచేసినవారు 81 మంది నెలలు నిండకుండానే ప్రసవించినారు. 104 శిశువులు చనిపోయినారు. వారి ఆహారమును గూర్చి కరపత్రములు అచ్చువేసియిచ్చి లెక్కలిచ్చి లాభంలేదు. ప్రతివ్యక్తినీ, ప్రతినిత్యమూ పరిశీలనగా గమనిస్తూ ఆహారము నడుపవలెను.

♦ ♦ ♦ ♦

ఈజిప్టు ఎడారులలోనుండి ఒక నత్తగుల్లనుతెచ్చి - లండన్ నాచురల్ హిస్టరీ మ్యూజియంలో ఉంచారు. అది చచ్చినట్లు, 4 సం॥ లు బల్లకంటుకొని ఉండిపోయింది. ఒకరోజున కొంచం బ్రతికిఉన్న లక్షణాలు కనుపడేసరికి ఒకఅధికారి ఎత్తి దానిని నులివెచ్చని నీట వదిలినాడు. మరి 15 నిమిషాలకు నత్తగుల్ల కదలి,నడవడం ఆరంభించినది. మరునాడు ఆహారం పుచ్చుకోవడంకూడా మొదలుపెట్టింది. అయితే ఈనాలు గేళ్ళు దానిఆకలి ఏమైంది? ఎలా అణచుకొన్నది? దానికి జవసత్వమునిచ్చి ప్రాణాలు నిల్పేశక్తి ఎక్కడ నక్కిపెట్టుకున్నది ? ఇవన్నీ శాస్త్రజ్ఞులను చీకాకుపెడుతున్న ప్రశ్నలు.



చిత్తూరు జిల్లాలో మహిళా కాంగ్రెసు మహాసభలో శ్రీమతి భారతీదేవిరంగా గారిలా ఉపన్యసించారు :—

స్త్రీలు అంధకారం నుండి వెల్గులోకి రావాలి. పురుషులతో సమాన బాధ్యతల్ని నిర్వహించాలి. మనలో పట్టుదల విశ్వాసము పెంపొందాలి. కుటీర పరిశ్రమలు చేతిపనుల్ని పెంపొందించి ఆర్థికంగా పురుషులు సాయపడాలి. స్త్రీలకు యెంతమాత్రం విశ్రాంతిలేదు. చెరసాలలో నున్నప్పుడు నాతోపాటు యెందరో స్త్రీలు విద్యావంతులయ్యారు. మనలో అవకాశాలులేక యెందరో అంధకారంలో వున్నారు. గొప్ప గొప్ప రాజకీయ వేత్తలకుండిన అవకాశాలు మన స్త్రీలకుంటే యెంతో గొప్పవారయ్యేవారు. స్త్రీలు మంచి భాషను మాట్లాడ్డం నేర్చుకోవాలి. ప్రథమ చికిత్స చేయడం నేర్చుకోవాలి. పురుషులు పాల్గొంటున్న అన్ని రంగాల్లోనూ స్త్రీకూడా అనుభవాన్ని గడించాలి. స్త్రీలు విజ్ఞానవంతులైనపుడు పురుషుల్ని నీచంగా చూడ్డం తగని పని. మనం త్యాగపురుషుల, వీరనారీమణుల అడుగుజాడల్లో సంచరించాలి. స్త్రీలు మొదట తమ్ము తాము రక్షించుకోవటం నేర్చుకోవాలి నౌఖాళీ, బీహారు కల్లోలాల్లో స్త్రీలకు జరిగిన అవమానం మరచిపోకూడదు కులమత భేదాల్ని విడిచిపెట్టాలి. అస్పృశ్యతను తొలిగించడానికి స్త్రీలే పూనుకోవాలి. పిల్లల్ని చదివించాలి. వృద్ధులైనా చదువుకోడానికి ప్రయత్నించాలి. మన చుట్టుప్రక్కల దొరికే సులభమైన వస్తువుల్తో మందులు చేయడం నేర్చుకోవాలి. వ్యవసాయాన్ని సాగించడంలో పురుషుల కన్ని విధాలుగా తోడ్పడాలి. పశువుల్ని కోళ్ళను పెంచడంలో ప్రత్యేక శ్రద్ధవహించాలి.

హైదరాబాదు స్టేటుకాంగ్రెసు మహాసభా సందర్భంలో శ్రీమతి సుచేత కృపలానీ దేవిగారు వామన నాయక నగరం (కాంగ్రెసు మహాసభ) లో జండా ప్రదర్శనోత్సవ ప్రారంభము కావించుచూ ఈవిధముగా నుపన్యసించిరి :—

హిందూస్థానము నుండి హైద్రాబాదు వేరుగాదు. రెండున్నూ ఒకటే. హిందూస్థాన స్వాతంత్ర్య యుద్ధము మనందరి యుద్ధమైయున్నది. గాంధీగారు మనలను నవరించుకొంటూ మనకు స్వాతంత్ర్యపథమును సరిగా జూపిస్తూ నడిపించుటకై చెప్పరాని కష్టములు పడుతూ ఉంటూరు. వారిని మనమంతా అనుసరిస్తూ ఉండడమే ముక్తికి హేతువైయుండును. మనకు ప్రజాసత్తా రాజ్యమే అవసరము. మనదేశములో కూటికి బట్టకు లేనివాడొక్కడున్నూ ఉండరాదు. విద్యరాని స్త్రీపురుషు లెవ్వరున్నూ ఉండరాదు. ఇదిమన ఆదర్శము. ఇక ప్రజలదే రాజ్యముగానుండును. ప్రజాపరిషత్తు అటులనే నిర్ణయించినది. ఎనిమిదవ ఎడ్వర్డు రాజు తానుకోరిన స్త్రీని పెండ్లాడుటకు బ్రిటిషుప్రజలు ఇష్టపడలేదు. అందుపై అతడు బ్రిటిషు సామ్రాజ్య పట్టమునే వదలుకొని పోవలసి వచ్చెను. మనకాలముననే జరిగిన యీఘట్టమును గమనించిన ప్రజాశక్తి యెట్టిదో వెల్లడికాగలదు. మనమింకా చాలా త్యాగాలు చేయవలెను. త్యాగములేనిది భోగములేదు.

# భారతస్వాతంత్ర్యచట్టం

(పార్లమెంటులో బిల్లు)

బ్రిటీష్ పార్లమెంటులో అట్లీప్రధాని భారతస్వాతంత్ర్య చట్టానికి బిల్లు నొకదానిని ఈ జూలై 4 వ తేది శుక్రవారమునాడు ప్రతిపాదించాడు. క్రమంగా చర్చజరిగి ఈ నెలాఖరులోగా చట్టంగా తీర్మానమవుతుంది. అందులో ముఖ్యాంశాలు:—

(1) భారతదేశంలో భారతదేశంఅనీ పాకీస్థానముఅనీ రెండుడొమినియన్లు 15-8-47నుండి ఏర్పడతాయి. పాకీస్థానంలో తూర్పుబంగాళముఅనీ, పశ్చిమపంజాబ్ అనీ ఆనాటికి (15-8-47) నిర్ణయమయ్యేవి, తర్వాత రెఫరెండంవల్ల, బౌండరీ కమిషన్ వల్ల తేలగలిగే సిల్హట్, సరిహద్దు పరగణాలు, యింకా పంజాబు, బంగాళాలో ఉభయప్రాంతాల సరిహద్దులలో పాకీస్థాన్‌కు చెందవలసినదిగా బౌండరీ కమిషన్ల చేత నిర్ణయమయ్యేవి, బెలుచిస్థాన్ ప్రాంతాలు చేరుతాయి.

(2) పాకీస్థాన్‌కు చెందగలిగేవిగాక - బ్రిటిష్ యిండియాలో నాటికిఉండే ప్రదేశాలన్నీ - భారత డొమినియన్‌లో చేరుతాయి.

(3) రెండు డొమినియన్‌లకు ఒకే వైస్‌రాయి ఉంటాడు. వారిలో ఎవరైనా తమ శాసనసభలో మాకు వేరేగవర్నరు జనరల్ కావాలంటే ఇద్దరేర్పడతారు. వారిని రాజుగారే ఏర్పరుస్తారు.

(5) ఇక నీ రెండు డొమినియన్‌లు చేసే శాసనాలకు రాజుగారి అభ్యంతరము ఏమీయుండదు.

(6) ఆనాటితో స్వదేశ సంస్థానాలమీద సార్వభౌముని అధికారం తొలగిపోతుంది. ఆయా సంస్థానాలు వారివారికి ఇష్టమైన డొమినియన్ యూనియన్‌తో చేర్చవచ్చు.

(7) ఇంగ్లాండు రాజుగారికి "భారతదేశపు చక్రవర్తి" అనే బిరుదు అంతరిస్తుంది.

(8) ఆయా డొమినియనులు (కాన్‌స్ అస్సెంబ్లీలు ద్వారా) స్వతంత్రరాజ్యాంగచట్టము లేర్పరచేగా అవి అమలుకు వచ్చేదాకా 1935 చట్టమే తగుమార్పులతో అమలు జరుగును. కాన్‌స్ అస్సెంబ్లీలే ఆయా డొమినియనులకు కేంద్రశాసనసభ లవుతాయి. వానిలో నుండి బాధ్యతాయుత ప్రభుత్వము లేర్పడగలవు.

(9) సివిల్ సర్వీస్ వర్గము అంతరించిపోతుంది.

(10) సేనలు ఉభయరాజ్యాలకు విభాజ్యమవుతాయి.

[ 3 వ హంశంప్రకారం పాకీస్థానమునకు జిన్నాగారిని, భారతదేశమునకు మౌంట్‌బ్యాటన్ ప్రభువును గవర్నరుజనరలులుగా రాజుగారు ఏర్పరచినారు. ]

---

# సంపాదకీయములు

## వైద్యకళాశాలలు: స్త్రీ విద్యార్థినులు.

ఈ సంవత్సరమున వైద్యకళాశాలలలో 100 కి 23 వంతున స్త్రీ విద్యార్థినులను చేర్చుకోవలసినదని మద్రాసు ప్రభుత్వమువారు ఉత్తర్వులుచేసిరని వినుటకెంతయు సంతసించుచున్నాము. మన దేశమున డాక్టర్లకరువు చెప్పనక్కరలేదు. అందు ముఖ్యముగా స్త్రీ డాక్టరులవిషయము మరియు నధ్వాన్నముకదా. స్త్రీకి వృత్తి, ఉద్యోగములపై ఆసక్తి ప్రబలినది. స్వతంత్రముగ, గౌరవముగ, ప్రజాక్షేమకరముగా స్త్రీ గావింపదగినది వైద్యవృత్తియొకటి. మనదేశమున ఆరోగ్యం బాగుపడవలెనంటే తల్లిశిశువును విజ్ఞానముతో పెంచుటకు నేర్వవలయును. తగినంతమంది స్త్రీ వైద్యురాండ్రు ఏర్పడి జాగ్రత్తగా తల్లులకు బోధనొనర్చినగాని అది పొసగజాలదు. కావున ఇదిచాల అభిలషింపదగిన ఉత్తరువు. పూర్వమంత్రివర్గమున వైద్యశాఖచేబట్టిన మంత్రిణితొలంగి ఒక్కస్త్రీయులేని మంత్రివర్గమైనా, ఈ ఉత్తరవుగావించినందుకు మంత్రివర్గమువారు అభివందనీయులు. ప్రభుత్వపు టుత్తర్వులతో సర్వముపూర్తిగాదు. ఆ ఉత్తరువులమేరకు పూర్తికోటావిద్యార్థినులు చేర్చుకొనబడిరాలేదా యనిమహిళాసంఘములు శ్రద్ధవహించి పరిశీలింపవలయును.

## ఆడపోలీసులు.

యు. పి. రాష్ట్రప్రభుత్వంవారు త్వరలో ఆడపోలీసుసిబ్బంది నేర్పరుపనున్నారని వినుటకుసంతసించుచున్నాము. అచ్చట వీరిఅవసరము చాలాకన్పించినదట. ఇటీవలహిందూ ముస్లింఅల్లరులలో కొన్నిఇండ్లలో సోదాచూచుటకు ఆయిండ్లలోని ఘోషాపద్ధతి అడ్డమువచ్చినదట. అందుచేయీపోలీసు దళమును ముఖ్యమగు మండలకేంద్రములనుంచి వీరికిసహాయముగా మగపోలీసుల నిచ్చెదరట. ఈఆడపోలీసులను ఉద్యోగములు దిరుసులు, ఉత్తరువులు మాత్రమిచ్చి ప్రమాదమునకెదురు నడిపించుటయగునేమో! వీరికి పురుషసహాయము గాక, వారేయే ఆయుధముల నాత్మసంరక్షణార్థమై ఉద్యోగనిర్వహణ సమయమునుపయోగించవలెనో వానినన్నిటినీ ఉపయోగించేనేర్పునూ వీరికి కలుగచేయడం అత్యవసరమని మాఅభిప్రాయం కొన్నిచోట్ల ఘోషాపేరు చెప్పి పురుషులు దాగియుండుటకూడాకద్దు. అట్టిచోటపురుషుడు కాన్పించినంతనే అవసరమేని కాల్చివేయుటకున్నూ, ఈఆడపోలీసుకధికారముండదగును. ఒక్క యు. పి.లోనేగాక అన్నిరాష్ట్రములలోనీ ఆడపోలీసులేర్పడుట అవసరమనికూడా మాఅభిప్రాయం.

## తుంగభద్రప్రాజక్టునగరం: కార్మిక బాలబాలికలకుశిక్షణ కేంద్రం.

తుంగభద్ర ప్రాజక్టుపనిప్రారంభమైనదంటున్నారు. ప్రాజక్టుపని అసేసరికి ఎంతోమంది కార్మికులు కావాలి. వాళ్లక్కడ కొన్ని సం॥ లు కాపురాలేఉండాలి. అదోనగరమైపోతుంది. అయితే ఆకార్మికులకు పిల్లాజెల్లా కూడాఉంటారు. వారికాకొత్తచోట బళ్లు,పాఠశాలలు ఎక్కడనుంచివస్తాయి? తామొకచోపని చేసుకుంటూ మరొకచోటబిడ్డలను చదివించేదార్ఢ్యమువారికుండదు. ఈసంగతికనిపెట్టి హైదరాబాదు ప్రభుత్వము వారికొకశిక్షణ శిబిరమును తెరువనిర్ణయించినారట. ఇందుకువారెంతైనా అభివందనీయులు. ఆశిబిరములోకార్మికుల బాలబాలికలకు చదవడం వ్రాయడములెక్కలునేగాక గృహపరిశ్రమలున్ను నేర్పుతారట. అది పిదప వారిబ్రతుకుతెరువుకు మూలం కాగలదు.






## అష్టావక్రచరిత్రము.

సుప్రసిద్ధపండితులు, కవులు, విమర్శకులునగు శ్రీ బులుసు వేంకటేశ్వర్లు బి. ఏ. గారు రచించిన ఆధునిక పద్యకావ్యమిది. భారతాంతర్గమగు అష్టావక్రునిచరిత మిందలి కథావస్తువు. ఆధునిక పద్యకావ్యమయ్యు అన్నిట పురాతన పద్యకావ్యముల బోలియున్నది. వెల రు 1-8-0 వలయువారు వావిళ్లరామస్వామి శాస్త్రులు అండుసన్సు వారికి వ్రాయుడు.

## శ్రీ మహర్షి జీవిత కథామృతము.

ఇదియు పైవెంకటేశ్వర్లుగారే రచించిన వచనగ్రంథము. ఇందు నారద, పరాశర, భరద్వాజ, భృగు మార్కండేయ, యాజ్ఞవల్క్య, వశిష్ట, విశ్వామిత్ర, వ్యాస, శుకులను పదిమంది ప్రాచీన భారతవర్షమహర్షుల జీవితచరిత్రములు పొందుపరుపబడియున్నవి. వచనమైనను జటిలమైన గ్రాంథికభాషయందు వ్రాయబడెను. భాషాప్రవీణ తుదిపరీక్షకు పాఠ్యగ్రంథముగా (1949—50) నిర్ణయించిరనగా దీని ప్రాశస్త్యము వేరుగ చెప్పనవసరములేదు. వెల రు. 2-0-0 వలయువారు; గ్రంథకర్తపేరట శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు. బి, ఏ, రామారావుపేట, కాకినాడ అనివ్రాయుడు.

## విద్యార్థిని.

బాలికను యుక్తవయసువచ్చేదాక చదువుకొరకు అవివాహితనుగా ఉంచి, పురుషులతోపాటు చదువవలసిన కాలేజీవిద్యలో ప్రవేశపెట్ట—తద్వారా,—ఆమె తోటిబాలురతో స్వేచ్ఛగా తిరుగు నవకాశములుకలుగగా ఏర్పడిన అసంగతములను చూపుచు వ్రాయబడిన సాంఘికనాటకమిది. అంతావచనం. వ్యావహారికభాషలో రచింపబడినది. కర్త: శ్రీ పసుమర్తి రాఘవరావుగారు 'పెంకిపిల్ల' పత్రికాసంపాదకులు వెల రు 0-12-0లు వలయువారు తారాపబ్లికేషన్స్. 35 వీరపెరుమాళ్ కోవిలువీధి, మైలాపూరు. మద్రాసు, అనివ్రాయండి.

## రాష్ట్రగీత.

దీనినిరచించినది - శ్రీ చదలువాడ కోటి నరసింహముగారు. తమకుతోచిన విషయములను రాట్నము ఖద్దరు, అహింస, శిల్పి, ఇడ్డెన-కాఫీ, మున్నగు విషయాలను కొన్నిటినెత్తుకొని ఒక్కొక్కటికి ఒకటి రెండు గీతములుగా మొత్తమున 40 గీతములను రచించి నాడీకవి. చిన్న బాలబాలికలచే కంఠపాఠము చేయించదగినవి వెల రు 0.2.0 మాత్రమే. వలయువారు: కవిగారికి నిడుబ్రోలు అనివ్రాయుడు.

## ఆయిల్ ఇంజను డ్రైవింగు

ఇది యాంత్రికయుగము. 25 సం॥లుగా యంత్రములకు వ్యతిరేకముగా, గాంధీయు అతని శిష్య వర్గమున్నూ బోధించినమాట వాస్తవమే. అయితే ఆ శిష్యవర్గమునకే ఆ వాదము చక్కగా అంటలేదనగా ప్రజాసామాన్యము మాట చెప్పవలెనా ? "అభావో విరక్తి" అను న్యాయమును నిజమే. యుద్ధము ముగిసి అవిలభ్యమగుసూచన కాన్పించగనే ప్రజల మనసులు మానవకృషితగ్గించు యంత్రములవైపుమరలినవనుటకు ఇటీవల ప్రకాశంప్రభుత్వపు టెక్స్టైల్ విధానము నెడల వైఖరేసాక్షి. 1931 లోనే ఈగ్రంథమును వ్రాసియున్నారు. 1947 లోదీనికి పునర్ముద్రణయోగముపట్టినది. చక్కని తెలుగుభాషలోనీ గ్రంథమును రచించిన శ్రీ కోట యజ్ఞరాయశర్మగారభివందనీయులు. వెల రు2-8-0 మాత్రమే. వలయువారు గ్రంథకర్తపేరట చింత గుంటపాలెం, బందరు అనివ్రాయండి.

●

## చందమామ.

పిల్లల మాసపత్రిక; సచిత్రం. కొత్తది. చాలా బొమ్మలతోఉన్నది. ఈ పత్రికాధిపతులు శ్రీ బి. యన్. రెడ్డిగారు. వీరిచేతిలో పేరుపొందిన అచ్చుయంత్రమున్నది. రాజుతలిస్తే దెబ్బలకుకొరవా ? రకరకాలబొమ్మలు, అనేకవిధాల అచ్చులు, కథలు, పాటలు, వ్యాసాలుఉన్నవి. చలం దీక్షితులుగార్లు ఆహ్వానంఅనే గేయంవ్రాశారు. ఆగేయంవైఖరి పాతది; పదాలు, భావాలుకొత్తవి. తెలుగుపిల్లలనోట్లోనేతిపి ఉంచినందుకు వారికి ధన్యవాదాలు." పిల్లలుచదివి నేర్చుకోవడానికేర్పడ్డ పత్రికలో 'ఎలక, ఏనిగ' లాంటి యాసబాసతగ్గిస్తే మంచిదేమో; గాంధీగారి చిన్నతనపు చేష్ట నొకదాన్ని మొద్దుపని అనడం అంతబాగాలేదు. దాదాపు 30 లక్షలసంఖ్యగల ఆంధ్రబాలబాలికలకు 'బాల'ఉండగా 'చందమామ'కూడాఏర్పడడం ఎక్కువ కాదు; వారుతెలిసి ఆదరించవలసిందేగాని ! 'చదవండి' చుట్టూవేసినబొమ్మల్లో ఒక్కతెలుగు మూర్తికూడా లేకపోవడం ఆశ్చర్యమే. ఈకొత్తపత్రికను మనఃపూర్వకముగా ఆహ్వానిస్తున్నాము. చందాసంగతి ఎక్కడ వెతికినా కన్పించలేదు. దొరికేచోటు చందమామకార్యాలయం, 37 ఆచారప్పన్ వీధి, జి. టి. మద్రాసు.

## సచిత్ర.

సచిత్ర, ఆంధ్రపత్రికాప్రపంచమున కొత్తగావెలిసిన మాసపత్రిక. 'సచిత్ర' అని కత్తిరించినటుల చెప్పుటచే అసలు పత్రికస్వభావము పేరున తెలియుటలేదు. కాని లోపలవివరణమున సంపాదకులు అన్నివిధములగు అభ్యుదయములు పత్రికకోరుననియు, ముఖ్యముగా వివాహవిషయముల నిది తీవ్రసంస్కారమునభిలషించుననియు చెప్పుచున్నారు. అయితే హిందూసంఘము తీవ్రసంస్కారము నోర్చునాయని మాసందేహము. ఇందలి రచనలునూ కొంతస్వేచ్ఛను ప్రోత్సహిస్తున్నవి. అయితే చలంగారి రచనలు మొదలైనవి ఉత్తమ పథమున నడుస్తున్నవి. సంపాదకులగు శ్రీ డి.సోమసుందరావుగారి ఈకొత్తపత్రికను హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాము. సాలుచందా రు 3-8-0. వలయువారు: 6 మేయర్ బాసుదేవన్ వీధి, చాకలిపేట మద్రాసు అనివ్రాయుడు.

---

Printed and Published by Dr. S. Seshagiri Rao. at the Lodhra Press, Kesari Kuteeram Ltd, 15, Westcott Road, Royapettah, Madras. Editor; Dr. K. N, Kesari.